# సమాలోచన



జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక

సంపాదకుడు: విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి.

సంపుటము 2 రాజమహేంద్రవరము 16-3-1979 సంచిక 10

—* ఈ సంచికలో *—



1—4—79 సంచికలో ఆంధ్రమున ఆంగ్లపరిణామము, నవలా సాహిత్యము - లత, కొన్ని ప్రయోగాలు ఒక వివరణ మొదలగునవి ఉంటాయి.

—* 1, 16 తేదీలలో ప్రచురింపబడును *—

చందా
సంవత్సరమునకు రు 10-00.
అర్థసంవత్సరమునకు రు 5-50.

విడిప్రతి 50 పై.

# కవికళాదులు

— శ్రీ కపిలవాయి లింగమూర్తి.

న తచ్ఛాస్త్రం న తచ్ఛిల్పం,
  న సా విద్యా న సా కళా
జాయతే యన్న కావ్యాంగం,
  మహోభారో మహాకవేః

కావ్యాంగం కానిదని శాస్త్రంగాని, శిల్పంగాని, విద్యగాని, కళగాని లేదు; గాబట్టి కవియైనవాని మీద పెద్దభారముందని భరతముని చెప్పాడు. కవికి కావలసిన వానిలో ప్రతిభావ్యుత్పత్త్యభ్యాసాలు ముఖ్యమైనవి. వానిలో వ్యుత్పత్తి లోకశాస్త్ర కావ్యాద్యవేక్షణవల్ల కలుగుతుందని మమ్మటాచార్యుని మతం; గాబట్టి కవులకు శాస్త్రాలతో పాటు లోకాన్ని గూడా పరిశీలించవలసి వచ్చింది. ఆ కారణంగా వారికావ్యాల్లో ఆయాకాలాల సాంఘిక జీవితం, ప్రజల వృత్తులు, కళలు చోటు చేసుకొని నిలిచాయి. కవులు గూడా కళాదులవలె సువర్ణశిల్పులే గాబట్టి వారన్ని శిల్పాలకంటె స్వర్ణశిల్పాన్ని బాగా పరిశీలించినట్లు కనిపిస్తుంది. ఇంక ఉదాహరణలు పరికించండి.

మనకవుల కాదిభిక్షు పెట్టిన వాడు నన్నయ్యగారు. ఆయన సభాపర్వంలో పాండవుల వైభవాన్ని చూచిన దుర్యోధనుని గురించి

కందుగల పసిడి గాచిన
కందివివర్ణమయినయటు కౌరవుకాయం
బొందగ వివర్ణమై కడు
వందెమనస్తాప మహ్య వహ దాహమునన్.

అని చెప్పాడు. ఈ ఉపమ మహాభారతంలోని ఉపమల కెల్ల మకుటాయమానం, ఆయన చెప్పిన ఈ ఒక్క ముక్కలో ధర్మజదుర్యోధనుల లక్షణాలన్నీ సంపూర్ణంగా ధ్వనించాయి. స్వర్ణలక్షణం తెలిసి ఉంటేకాని యిందులోని యాథార్థ్య ప్రయోజనాలు బోధపడవు.

నన్నయగారింటిలో ప్రయోగించిన 'కందు'కు నలుపనే సామాన్యార్థమున్నా సాన్నారుల్లో అది లోహసంబంధమైన కల్మషానికే రూఢి. ఈ కందుకు కేటని మరో వ్యవహారం.

నన్నయగారిమత ప్రకారం మహాభారత పాత్రలలో ధర్మజుడు మేలిమి. దుర్యోధనుడు నవరసు. ఈ పదం సవరనుకు వర్ణవ్యత్యయ రూపం. సవరను స్వర్ణశబ్ద వికృతి. దీన్ని నాడు కాసని పిలుస్తారు. మేలిమి, కాసు ఈ రెండు బంగారాలే అయినా కాసుకు తళుకెక్కువ, మేలిమికి తక్కువ; కాసు కఠినం, మేలిమి మెత్తన. నగదృష్టితో కాసుపయోగించినంతగా మేలిమి ఉపయోగించదు. కాని అదేమాత్రం వేడి తగిలినా నల్లబడిపోతుంది. మేలిమి యెంతకాచినా రంగు మారదు. అంతేకాక అది ఓర్చినంతకాక కా సోర్వదు. దీన్నిబట్టి దుర్యోధనునికి పైడాబెక్కువ. ధర్మజుడు మెత్తనివాడు. లోకవ్యవహారంలో దుర్యోధనుడు చెలామణి అయినంతగా ధర్మజుడు గాలేదు. దుర్యోధను డేమాత్ర మవమానం, తాపం కలిగినా కళకగ్గి వెంటనే బయటపడిపోతాడు. ధర్మజు డాలా కాక ఎంత జరిగినా సుఖదుఃఖాల్లో ఎప్పుడొకేతీరుగా ఉంటాడు. అనే విషయాలిందులో ఉపమానధ్వనితో వ్యక్తమౌతాయి గాబట్టి యీ విధంగా ఒక్క ముక్కలో వారితత్వాన్నంతనూ బయటపెట్టిన యీ ఉపమానం ఎంత అద్భుతమయిందో ఆలోచించండి.

ఈలాంటి బంగారు ఉపమానాలు విజయనగరకాలంలో ఎక్కువగా కనిపిస్తాయి. అది స్వర్ణయుగం కదా! స్వర్ణశిల్పానికి మహోన్నతదశ పట్టినకాలం. రాయల కాలంలో ఒక్క రాచనగరులోనే అమ్మగారలకు సొమ్ములు చేసేటందుకు రెండు వందలనుంది స్వర్ణకారు లుండేవారట. ఇక నగరి వెలుపల నెందరుండేవారో! అందువల్ల కవులు వారి పనితనాన్ని పట్టి పట్టి పరిశీలించి ఉంటారు. నిదర్శనాలు చూడండి. వరాహపురాణకర్తలు

స్మరసమరంబునన్ పరవ
  శత్వము నొంది మహేంద్రనీలభా
స్వరమగు దానవాంతకుని
  వక్షముపై నొరగంట చక్కగా
నొరసిన హేమరేఖవలె
  నున్న రమారమణీలలామ యీ
శ్వర నరసింహభూపతి నివాసమునన్
  వసియించు గావుతన్.

అని లక్ష్మీదేవిని ఒరగంటిపైగల బంగారు టొరరేఖతో పోల్చారు. ఆంధ్రసాహిత్యంలో ఇది మరో అద్భుతోపమ. ఒరగల్లు నల్లగా నిగనిగలాడుతూ, బంగారం మెరుపుతీగలా మిలమిలలాడుతూ ఉంటాయిగాబట్టి, నల్లని యొరగంటిపై మలమిలలాడే బంగారురేఖ యెంత మనోహరంగా కనిపిస్తుందో ఆసాగసు చూచినవారికిగాని తెలియదు. ఇక ఈ ఉపమాసామగ్రిలో ఒరగల్లు కేవలం శిల, బంగారం విలువైనలోహం. ఆశిల కఠినం, ఈ లోహం మృదువు. గాబట్టి అవి దరిద్రదామోదరుడైన విష్ణువు, బంగారుపిచ్చుకయైన లక్ష్మీదేవి స్థితులకేకాక స్త్రీ పురుషుల స్వభావాలకు గూడ చక్కని వ్యంజకాలు. ఇంతేకాక యిందులో మరోవిశేషం గూడా ఉంది. బంగారాన్ని ఒరగంటిపై ఒరిపిడి పెట్టినపుడే దానిలోని చేవ యెంతో నిగ్గుదేలిపోతుంది. గాబట్టి సతిగూడ పతితో ఒరిపిడిపొంది, పరవశత్వాన అతని యెదపై శయనింపగలిగినపుడే ఆమెలో సరసత్వం ఎంత ఉందో తేలిపోతుందనే సూచనతోపాటు

ఆ కవులు దీనిలో గూఢంగా పురుషాయితాన్ని గూడా సూచించారు.

ఈ కవులదే మరో ఉపమానం తిలకించండి. వరాహ పురాణంలోనే దుర్జయుడు దేవతలపైకి దండెత్తి వెళ్ళినపుడు ఇటు రణరంగ నర్తితహ

యీనటి దుర్జయు భూమిపాలు ధూ
ర్జటి యెఱమన్న బూసిన హి
రణ్యపుపూదియ దెచ్చి వన్నె దా
ల్చుటకు నిజప్రతాపశిఖి
లోబడవైచి రీతి క్రొత్తనె
త్తుటనిబిడంబునన్ గలయ
దోగిన మేరువు డిగ్గి కాంతునై.

అని అతని దండయాత్రను బంగారు పుటంతో పోల్చారు. సొన్నారులు బంగారాన్ని రేకుపుటం పూదెపుటం అని రెండు విధాల పుటాలు పెడతారు. వానిలో రేకుపుటానికి పెద్దపుటం, తక్కినదానికి వరపుట మని పేరు. రేకుపుటంలో బంగారాన్ని పలచని రేకులుగా జేసి, వానికి చిక్కని చింతపులుసు పట్టించి దానిపై ఉప్పుకలిపిన బూడిదచల్లి వానిని ప్రమిద వంటి ఓపలుచని పెంకులో పెట్టి పైని మరొక పెంకు కప్పి ఆపుటాన్ని పిడకల దాలిలో కాలుస్తారు. ఈవిధంగా కొన్ని తడవలు కాల్చేసరి కారేకులు మేలిమితనాన్ని పొందుతాయి. ఇక వరపుటంలో అలాగాక పూదె కాలాగే యెఱ్ఱనిమట్టి పూసి పెంకులలో పెట్టి కాలుస్తారు. ఈ పుటంలో దానికి పైవన్నె మాత్రమే వస్తుంది గాని లోపల మేలిమితనం రాదు. అంతేకాక దానిపై రూపం గూడా చెడదుగాబట్టి వన్నెకోసం ఒక్కొక్కపుడు గట్టినగను గూడా ఈ పుటం పెట్టడం కద్దు.

నిబిడంగా నెత్తురుతో దోగిన మేరువు దుర్జయుని ప్రతాపశిఖిలో ఎఱ్ఱమన్ను పూసిన బంగారుపూదెలా కనిపించిం దని యిక్కడ కవులు వరపుటాన్ని చెప్పారు. మేరువు దేవతారాజ్యం గనుక దాన్నెవరు గెలిచినప్పటికీ అది పైపైగెలుపే కాబట్టి సంపూర్ణంగాగాక కేవలం పైపైవన్నెను మాత్రమే తెచ్చే వరపుటంతో వీరి యుద్ధాన్ని పోల్చటం ఎంతైనా సబబెరిగి చేసినపని. వీరిదే మరొక ఉపమ గూడా చూడండి.

సుమవశ్చాపుని రాణివాసమునకున్
సొమ్ముల్వినిర్మించు య
త్నమునన్ విచ్చిన మెట్టదమ్మికమటానన్
కేసరాంగారమ
ధ్యమునన్ వైచిన కర్ణికాకనకమున్
దన్వీ! రజఃకీలపుం
జము నర్తింప గరంగెడున్ గనుము
కూజద్భృంగనాడింధమున్.

స్త్రీల కెంత సేపూ సొమ్ముల మీది దృష్టే కాబట్టి ఈ కవుల చేతిలో వనవిహారం చేసే చెలులకు ఝుమ్మనే రొదతో మెట్టతామరలో వ్రాలిన తుమ్మెద మన్మథుని రాణివాసానికి సొమ్ములు చేయటానికి బంగారాన్ని కరుగుతున్న అగసాలి వలె కనిపించింది. ఈ అగసాలికి మెట్టతామర కుంపటి. కేసరాలు దానిలో నిప్పులు. పరాగం ఆ నిప్పులయొక్క మంటలు. కేసరాలలోని కర్ణిక బంగారం, ఇది చక్కని సావయవరూపకం. ఈ జంటకవుల వీలాటి ప్రస్తావనలింకా గూడా ఉన్నాయి. ఇక రాయలను చూడండి. ఆయన ఆముక్తమాల్యదలో శరత్తును వర్ణిస్తూ

హెచ్చిన మైత్రి పద్మినుల
కెల్లఘునాత్యయకారకుండు సొ
మ్మచ్చుపడంగ జేయుటకు
నైయలక్రౌంచనగంబు పేరి క
మ్మచ్చున నిడ్చుశర్వగిరియందలి
వెండిసలాకపిండు నా
వచ్చిమరాళమాలికలు
వ్రాలె గొలంకుల వక్త్రచుంకృతిన్.

అని హంసలు మానససరోవరం నుండి రావటాన్ని కమ్మచ్చునుండిలాగే తీగతో పోల్చాడు. రౌప్యకారుడు కమ్మచ్చునుండిలాగే తీగ నిగనిగలాడుతూ ఎంతో మనోహరంగా కనిపిస్తుంది; కాబట్టి యిది రాయల యొక్క ప్రకృతి పరిశీలనతో నిశితమైన కళాపరిశీలనను గూడా పట్టియిచ్చే దానిలో ఒకటి.

శరత్తులో హంసలు కైలాసం నుండి క్రౌంచమార్గం గుండా వస్తాయని ప్రతీతి. కైలాసం మనపురాణాల్లో వెండికొండ గాబట్టి తెల్లని హంసలబారును వెండిసలాకపిండుతో అవివచ్చే క్రౌంచమార్గాన్ని కమ్మచ్చుతో పోల్చటం అపూర్వం. అంతేగాక యిందులో మరో విశేషంగూడా ఉంది. సొన్నారులు కమ్మచ్చునుండి తీగలాగే అపుడు చమురు చాలకుంటే ఆ తీగ పాట పాడుతూ వేడెక్కి పోతుంది. తీగ ఒకవేళ ఎక్కువ వేడెక్కితే సొన్నారులు దాన్ని లాగిన తరువాత వెంటనే నీటితొట్టెలో అద్దటం గూడా కద్దు. అందువల్ల హంసలూరకయే రాక వక్త్రచుంకృతితో వచ్చి కొలకుల్లో వ్రాలిన వని చెప్పటం రాయలయొక్క యీ నిశితపరిశీలనకు నిదర్శనం.

అన్యకవులే స్వర్ణశిల్పాన్నింత గా పరిశీలించినపుడిక స్వర్ణకారులైన కవులను గురించి యడుగ నక్కర లేదు. కవిలోకంలో కందుకూరి రుద్రయ్య సంకుసాల నృసింహకవి ఆజాతికి చెందినవారు. సంకుసాల తన కవికర్ణరసాయనంలో విమలాంగి విరహాన్ని చెబుతూ

పటికన్నార్చిన లీల చందనము పై
పై బూయ నంగారక
చ్ఛటలం గాచు తెఱంగునన్
జిగురు సెజ్జన్ బొర్లగా నప్పట
ప్పటికిన్ జెంగనిచ్చిన ట్లొడలిపై
బన్నీరు సల్లంగ ను
త్కటమయ్యెన్ పెనుగాక బంగరుసలా
కన్ బోలు నబ్జాలకున్.

అని యామెను పటికవన్నె ఆర్చే బంగారు శలాకతో పోల్చాడు. ఇక్కడ గూడా పాఠకుని కీతంతు కొంత పరిచయ

ఘుంటేకాని యీ ఉపమలోని సారస్యం తెలియదు.

సంకుసాల యీపద్యంలో చెప్పింది ంగారానికి వన్నె పట్టే ప్రక్రియ. ఇది వాసాగరపు వన్నె, మైలతుత్థపువన్నె, టికవన్నె, అని మూడువిధాలు. వీనిలో మొదటిదానిలో ఉప్పు, సౌరుప్పు, నవాసాగరం మూడూ సమపాళ్ళుగా కలుస్తాయి. వాటిని కొద్దిపాటి నీటితో కలిపి నూరి ఆకర్దమాన్ని నగకు పట్టించి దాన్ని న్నినిప్పులపై ఆరుస్తారు. వన్నె క్కగా ఆరేసరికి కర్దమం పొడిపొడియై మోస్తరు పసుపువన్నె తిరుగుతుంది పుడా నగను నిప్పులలో నుండితీసి టిలో అది చక్కగా కడుగుతారు. ఈ ధంగా రెండు మూడుతడవలు చేసేసరి గానగకు చక్కగా వన్నెపడుతుంది. ఈ న్నె బంగారునగ లన్నిటికి సర్వసామా న్యం. ఇక మైలతుత్థపువన్నె పటికివన్నె ప్రత్యేకమైనవి. మైలతుత్థపువన్నె గట్టి నం కావలసినవాటికి పటికివన్నె మెత్త నం కావలసినవానికి పెడతారు. మైలతుత్థపువన్నెలో మైలతుత్థం రెండుపాళ్ళు సౌరుప్పుఉప్పు ఒక్కొక్కపాలు ఉంటాయి. ఈవన్నెవల్ల నగకు కాంతి బాగా స్తుందిగాని అదిపెళుసు కూడా బారుతుంది. కాబట్టి ఈవన్నెను కేటుబంగారా కి వేస్తే ఆనగ విరిగిపోతుంది. ఇక పటికి వన్నెలో పటికి, సౌరుప్పు, ఉప్పు ఒక దానిలో ఒకటి అర్ధభాగంగా ఉంటాయి. ఈవన్నె మెత్తదనాన్నిస్తుంది గాబట్టి న్ని ప్రత్యేకంగా పెళుసుబంగారు నగ కు పెడతారు.

విరహతాపం గాబట్టి దానితో వేగిపోయే వారి మనస్సు పెళుసు బారటం సహజం. ఆసమయంలో చెలులుచేసే శైత్యోపచారాలామె మనస్సుకు శాంతి చ్చి మార్దవాన్ని చేకూరుస్తాయి కాబట్టి కవి యుక్కడి రహస్యాన్ని తెలిపే అందుకే విమలాంగిని పటికవన్నె ఆర్చే బంగారు శలాకతో పోల్చాడు. శరీరాని కంతకూ చందనంపూసిన విమలాంగి చిగురు సెజ్జపై పొరలుతూ పటికివన్నె పట్టించి నిప్పులలో పొరలించే బంగారుశలాకవలె ఉందనటంలో ఆబంగారాని కది పట్టించి నిప్పులలో పొరలించే వేడిచేతనే మెత్తదనం వస్తుంది గాబట్టి చెలులామెకు చేసే శిశిరోపచారాలు అంటే చందన చర్చ చిగురుసెజ్జ ప్రస్తుతానికి విరహోద్దీపకాలుగా కనిపించినా వానివల్లనే ఆమెకు శాంతి కలుగుతుందనేది ఈఉపమానంలో కవిసూచించే విషయం.

ఈవన్నెను కర్దమంగాగాక పెంకలో గూడ వేసి ఉడికిస్తారు. అపుడు దానిపై ఆరగా ఆరగా నీరుగూడా చల్లుతారు. కవి ఈవిషయాన్ని అప్పటప్పటికిన్ జేరగ నిచ్చినట్లొడలిపై పన్నీరు జల్లంగ!" అని సూచించాడు.

[నా కీవ్యాసానికి తిమ్మాజిపేట నివాసి జింత కృష్ణమూర్తి గారివల్ల విషయం లభించింది. ఈవిధంగా మనకావ్యాల్లో ఒక్క స్వర్ణశిల్పమేగాదు కమ్మరం కుమ్మరం మొదలైన పెక్కువృత్తులు విశేషాలు తెలిసివస్తాయి కాబట్టి వాటిని సమగ్రంగా పరిశీలించినపుడీవిధంగా మనవృత్తులలో ప్రాచీన విశేషాలనేకం బయటపడే అవకాశముంది.]

......

# విశ్వనాథవారి సాహిత్య విమర్శ

— శ్రీ శివలెంక ప్రకాశరావు, ఎం. ఏ.

( గతసంచిక తరువాయి )

నేను-నాసాహిత్యరచనలు : -యువభారతీసంస్థవారు పంపమంటే విశ్వనాథవారు వ్రాసినవ్యాసం ఇది. 'మహతి' అనే సమీక్షా వ్యాససంకలనంలో ప్రచురించబడింది. ఈవ్యాసం కవిసమ్రాట్టుల రచనాశైలికి, విలక్షణమైన ఆయన స్వభావానికి ప్రతిబింబంగా కనిపిస్తుంది.

1947-1972 మధ్యకాలంలో ఉన్న ఆయన సాహిత్యరచనలనుగూర్చి వ్రాయమనడంతో మొదట్లో నే'ఇది నావంటివాడికిచ్చే ప్రశ్న కాదు. ఎవళ్ళో అల్పరచనలు చేసేవాళ్ళను అడగవలసినవిషయం' అని తానొక అసాధారణవ్యక్తినని స్వోత్కర్ష ప్రదర్శించారు.

ఆతరవాత 'నేను చాలాసోమరిని' అంటూ కవిభ్రంగము, ఆశావాణి, శ్రీహర్షుడు మొదలైన పద్యాలూ భారతి, శారదవంటి పత్రికల్లో ప్రచురించబడినవనీ, అవన్నీ పుస్తకంగా వేస్తే తన రామాయణంలో సగం అవుతాయనీ, అలా చేయలేకపోవడానికి తనసోమరితనమే కారణమనీ తెల్పారు.

'ప్రస్తుతం మనదేశంలో పూర్వమార్గాలలో వ్రాసేది పనికిరాకపోతోంద'ని విమర్శిస్తూ తనవ్యక్తిత్వాన్నిగూర్చి వివరిస్తూ 'నేనుపోతే నాతోపోయేవాళ్ళు నన్నయ, తిక్కన, ఎఱ్ఱన, నాచనసోమనాథుడు, శ్రీనాథుడు, పోతన్న, పెద్దన్న, తెనాలిరామకృష్ణుడు మొదలయినవారు. ఊరికే ఒట్టిపూర్వకవులనికాదు - పద్యరచనాసామ్రాజ్యపట్టభద్రులు, కథాకథనశిల్పనూత్నాచార్యులు, వేదవేదాంతాది మహాగ్రంథస్థ మహావిషయ నిర్ణేతలు, బహువిషయ వ్యాఖ్యాతలు, కావ్యకథాశిల్పరహస్యవేత్తలు- అనే దృష్టితో ఆ పూర్వకవులను నిలబెట్టుకొంటే అప్పుడు నేనూ నిలుస్తాను. నేను చేసినపని అటువంటిది. రోజులు మారిపోయి తెలియటంలేదు' అని బాధపడ్డారు. (ప్రతిభవిభాగం-4,5 పే) ఇందులో 'అహంకారం ఉట్టిపడుతోందని పాఠకులు దుయ్యబట్టినా, విశ్వనాథవారికృషిని పరిశీలిస్తే నిజం అనిపించకపోదు.

తనపద్యరచనాశిల్పం పరిశీలించవలసిన పద్ధతినిగూర్చి వివరిస్తూ 'జీవుడు-కర్మ, సంస్కారము, జన్మపరంపర - ఇదిఒక

ప్రావాహికమైన ఊహాపద్ధతి. దీనిమీద ఆధారపడి భారతీయనాగరికతయొక్క మహాసౌధనిర్మాణము జరిగినది....ఆంధ్ర మహాకవులయొక్క పద్యరచనాశిల్పము యొక్క ఆయువుపట్టు ఇక్కడనున్నది. నాపద్యరచన అక్కడినుండి చూడవలెను. పద్యలక్షణములన్నియు సమృద్ధిగా నేయుండును. ఆత్మ అక్కడిది'(6 పే) అని అంటారాయన.

అంతేకాదు. తనకే బహుమానం వచ్చినా ఎంతోహంగామాజరగడం తన జాతకలక్షణమనీ తనఉపాస్యదైవములు ఎక్కువఆధ్యాత్మికంగా, తక్కువ లౌకికంగా ఉపయోగిస్తారనీ విశ్వనాథ తన భక్తితత్త్వాన్ని వివరించారు. (9 పే)

'నాకు విరోధులెక్కువమంది. ఎందుకో నా కర్థముకాదు. నన్నెరుగని వాండ్రు నేను దుర్జనుడనందురు. ఎరిగినవారు చాలమంచివాడందురు. నేనుచాలమందికి నాచేతనైనచో ఉపకారములే చేయుదునుతప్ప అపకారములు చేయనే చేయను. నాకిది వ్రతము. అవతలివానికి అపకారము జరిగెడి అబద్ధము చెప్పనే చెప్పను. నాకిది వ్రతము. ఏదైనా అంటే వాళ్ళు నాకు చాలా అపకారము చేస్తే అంటాను. ఒక్కటిమాత్రముఉంది. నేను అనటం ఘాటుగా ఉంటుంది. కనకనే తరువాత దానిని గురించి నాకు జ్ఞాపకముండదు. ఎవళ్ళకర్మను వాళ్ళుపోతారు. నాకేమి?' (9 పే) ఇదివారిమనస్తత్త్వానికి పట్టినఅద్దం. లోకానికీ వారికీ అందుకే చుక్కెదురు.

ఉపన్యాసాలు వ్యాసకర్తగా ఎంత కీర్తి గడించారో అంత ఉపన్యాసకర్తగా పేరుగాంచిన మహావ్యక్తి సత్యనారాయణగారు. ఎన్ని సభల కధ్యక్షత వహించారో, ఎన్ని ఉపన్యాసాలు చెప్పారో లెక్కలేదు. ఆ సందర్భాల్లో వారి ఛలోక్తులు, వ్యంగ్యవైఖరి, గంగాఝురిలా నడిచే వాగ్ధార, భావానుగుణంగా మార్పుచేసే కంఠస్వరం, పద్యపఠన సౌలభ్యం, మధ్యమధ్యలో కళ్ళు మోడు, లేదా ఉత్తరీయం సవరించుకోవడం, నోట్లోవేసోఉన్నట్లుగా నాలుక ఒక్కసారి ఆనగాలనుంచి ఈమూలకు కలయదిప్పే అలవాటు, వంటివి గమనిస్తూనే శ్రోతలు మైమరచిపోయేవారు. ఆ ఉపన్యాసప్రవాహంలోపడి కొట్టుకుపోయి 'ఎక్కడున్నామో' అని శ్రోతృగణం ఆలోచించేలోగా విశ్వనాథవారి ఉపన్యాసం అయిపోయేది. అయితే వీటిలో చాలాభాగం వాయులీనమయ్యేయేతప్ప రికార్డు చేయబడలేదు. అది నిజంగా తెలుగువారి దురదృష్టమే.

స్థాలీపులాకన్యాయంగా కొన్నింటిని ఉదాహరిస్తాను.

తిరుపతివేంకటేశ్వరకవుల కావ్యములు : (సాహిత్యోపన్యాసములు 10-పే 103-109) ఈ వ్యాసం తిరుపతి వేంకటకవుల శతజయంతి ఉత్సవ సందర్భంలో ఏర్పాటుచేసిన ఉపన్యాసం.

ప్రతివ్యక్తికీ అన్నివిషయాలలో ప్రవేశముండదు. ఉన్నా అంతంతమాత్రంగానే. దానికి విశ్వనాథవారుకూడా మినహాయింపుకాదు. అదేవిషయం 'నాకు వారి ,నాటకములయందు గిరత గుంటూరి సీమలయందు, కొన్ని శతావధానములయందు, వారి కొన్నిచాటువులయందు నున్నంత చొరవ వారికావ్యములయందు లేదు. ..వారి కావ్యపరిశీలనము మరియెవ్వరిచేతనైన చేయించవలెను. నేను దానికితగను. నాకావ్యదృష్టి వారి కావ్యదృష్టికంటె భిన్నమైనదేమోనని నాభయము'( పే 109) అని నిర్మొగమాటంగా ఒప్పుకున్నారు.

మాటాడటం తప్పదు అనుకున్నప్పుడు వారి విమర్శ ఏమాత్రం లోటుపడకుండా 'పీరిపాణిగ్రహీత కలదు. అదియొక ప్రహసనమని ఆగ్రంథమునందే వ్రాయబడియున్నది. లక్షణాపరియముకలదు. నారదుడు వచ్చెను...(106 పే) ఇలాసాగుతుంది.

ఆంధ్రమహాభారతోపన్యాసములు - నన్నయగారి భారతాంధ్రీకరణం '- భారతం ఆంధ్రీకరించడంలో నన్నయగారు వైదికమతాన్ని సంరక్షించే ప్రయత్నం చేశారని ఒకదుష్ప్రచారం లోకంలో ఉంది. కాని భారతావతారికలో నన్నయగారు ఈప్రసక్తి ఎక్కడా తేలేదు. అంతేకాదు. సభాపర్వంలో శిశుపాలవధ సందర్భంలోను, మందపాల చరితంలోను ద్రౌపదీవస్త్రాపహరణఘట్టంలోను నన్నయగారు కర్మకు ప్రాధాన్యం ఇచ్చారుకాని భగవద్భక్తికి కాదు. కథాకలితార్థయుక్తి లో నారసిమేలునా' అని వ్రాసినారు నన్నయగారు. భారతకథలోగల రమణీయత్వం, మెలుపులు, రహస్యాలు చూపించడం ఆయనకు ప్రధానం. అందుకే మూలంలో ఉన్న అద్భుతత్వం, విష్ణుమాహాత్మ్యం నన్నయగారుపరిహరించారు. నన్నయగారి రచన తెలుగువారు మాటాడుకొనునట్లుండును. ఆ మాటలలోని గడుసుతనమంతా పాదగబడి ఉంటుంది. రసమును శబ్దసంయోజనశక్తి నుండి నన్నయగారు కలిగిస్తారు. అది ఒక చమత్కారమైనమార్గం.

నన్నయగారి రచన రసభావాలను కరిగించిపోసినరచన అని అంటూ విశ్వనాథ ఒక చక్కని ఉదాహరణకూడాఇచ్చారు. 'ఏలకులు మిరియాలు, కుంకుమపువ్వు మొదలయిన వస్తువులతో మిళితము నగు పానకము త్రావినపుడు దానిలోని తీపి తనయు పీనియొక్కరుచిచేత నధిక సేవ్యమానముయినట్లుగా శైలీవృత్తిరీత్యాది గుణసామగ్రికల కవియొక్కరచనయందలి రసానుభూతి తద్విశిష్టగుణసహితముగా నుండును. అచ్చమయిన మధువునందు వట్టి మాధుర్యమే భాసించును. నన్నయగారి రచనయట్టిది సర్వదా రసభావములే గోచరించును. గాని యీ యలంకార మెంత చక్కగా వాడినాడు, ఇక్కడ నెంత గొప్పభావము చెప్పినాడు, ఇట్టిభావములేదావు' (21 పే)

నన్నయగారు భారతంలోని కథలకు వ్యాఖ్యానంచేసి భాష్యంవ్రాసి కథలోని

క్లిష్టార్థాలు విడివరచి చెప్పడమే కాక అసంగతంగా కనిపించేవాటికి సంగతత్వం కలిగించుతారు. విశ్వనాథ చివరకు సంస్కృతంలో వాల్మీకి, తెలుగులో నన్నయగారు మహాకవులని రూఢిగా చెప్తారు.

సాహిత్యోపన్యాసములు :- ఆంధ్ర సారస్వతపరిషత్తువారి అభ్యర్థనపై 1964 అక్టోబరు 27, 28, 29 తేదీలలో విశ్వనాథవారు చేసిన మూడుఉపన్యాసాలు కలిపి సాహిత్యఅకాడమీవారు ప్రకటించిన పుస్తకం ఇది.

1. కాళిదాసభవభూతులు:- సంస్కృత నాటకప్రపంచంలో కాళిదాసభవభూతులిద్దరూ కైలాసమేరుపర్వతాలనీ, ఉత్తర రామ చరిత్రలోకంటె భవభూతి తనశిల్ప సామర్థ్యం మాలతీమాధవంలోను అభిజ్ఞానశాకుంతలంలోకంటె కాళిదాసు విక్రమోర్వశీయంలోను మహాశిల్పం నిరూపించినారనీ విశ్వనాథవారు సోదాహరణగా వివరించారు. కాళిదాసు క్రీస్తుపూర్వం ప్రథమశతాబ్దంలోను, భవభూతి క్రీస్తుశకం 5వ శతాబ్దంలోను ఉన్నట్లు విశ్వనాథ రూఢిపరచారు (9 పే)

భవభూతి దాక్షిణాత్యుడనీ, తెలుగువాడనీ ఇంటిపేరు మేడిచర్లవారేమో అనీ విశ్వనాథ ఊహను వ్యక్తంచేశారు. అంతేకాక దక్షిణదేశంనుంచి ఎన్నోసార్లు అడవులగుండా కన్యాకుబ్జానికి చేసిన ప్రయాణఫలితమే మాలతీమాధవంలోని అరణ్యవర్ణనలని అంటూ రాయన (11, 12 పే)

భవభూతి మహాకవి తర్కవ్యాకరణ మీమాంసాది శాస్త్రాలు చదివినవాడయినా, కాళిదాసుఅంటె మత్సరంలేక అతణ్ణి అనుకరించాడని సోదాహరణంగా వివరించి, కాళిదాసు ధ్వనివేత్తనీ, భవభూతి శబ్దబ్రహ్మవేత్తఅనీ విశ్వనాథవారు తీర్పుచెప్పారు. ఈఉపన్యాసం వారి తారతమ్యపరిశీలనాశక్తికి ఒక మచ్చుతునక.

2. శాంత కరుణరసములు :- నాట్యశాస్త్రంలో 8 రసములే చెప్పబడినాయి. ఆలంకారికులు శాంతం తొమ్మిదివరసంగా లెక్కించారు. వాల్మీకి రామాయణంలో ప్రధానరసం కరుణమని చెప్పడమేకాక సర్వరసాలూ దానియందే పర్యవసిస్తాయన్నాడు. భారతంలో శాంతరసం ప్రధానం. నాగానందం, సంకల్పసూర్యోదయం, ప్రబోధచంద్రోదయం శాంతరసప్రధానమైన నాటకాలు. అభినవగుప్తాచార్యుడు అన్ని రసాలు శాంతంలోనే పర్యవసిస్తాయన్నాడు. (22, 23 పే)

మహాభారతంలో అనుక్రమణికనుబట్టి ప్రధానరసం శాంతమని చెప్పకపోయినా వ్యంగ్యంగా చెప్పబడింది. కాబట్టిశాకుంతలంలో శృంగారం ప్రధానమైన రసమని రూఢమయినా నిజానికి శాంతరసమే! రసనిర్ణయంకాని, మహాకావ్యధ్వనిగాని, కావ్యతాత్పర్యంగాని నిర్ణయించడానికి తాత్పర్యనిర్ణయార్థక షడ్లింగ నిర్ణయం చేసుకోవడం సులభమైనమార్గం. ఉపక్రమణం, ఉపసంహారం, అభ్యాసం అనేవి మొదటిమూడు. భవభూతి ఉత్తరరామచరితంలో కరుణమేఅంగిఅని వాచ్యంగానే చెప్పినాడు. శాంతం కరుణకు స్థాయిభావం. ఆదికవి తన ఈ కావ్యంలో కరుణరసం అంగిగా స్వీకరించడంలోని రహస్యంఇదే! (30, 39 పే)

ఉత్తరరామచరితలో శ్రీరామచంద్రుడు పరమేశ్వరుడన్నవిషయం వ్యంగ్యవాచ్యాల రెండింటిచేత నిరూపించబడినది. అందుకే 'ఉత్తరేరామచరితేభవభూతిర్విశిష్యతే' అన్నఉక్తి చిరస్థాయిఅయింది. (40-42 పే)

ఈఉపన్యాసంలో సత్యనారాయణగారి శాస్త్రపాండిత్యం, వాదనాపటిమ స్పష్టమవుతాయి.

3. మహాభారతరామాయణాలు - ఈ రెండు గ్రంథాలూ భారతీయులకు వేదాలవంటివి. మహాభారతకథ సుమారైదువేల ఏళ్లక్రితం జరిగినట్లు సాక్ష్యాధారాలున్నాయి. శ్రీకృష్ణుడు కార్తికశుక్లద్వాదశినాడు కౌరవసభకు రాయబారిగా వెళ్లాడు. తరవాత 15 రోజులకు యుద్ధం ఆరంభమయింది. అది కార్తికామావాస్య. జ్యేష్ఠానక్షత్రం. తరవాత 10 రోజులకు భీష్ముడుపడెను. అప్పటికి 58 రోజులకు ఉత్తరాయణం, దుర్యోధనుడి మృతి తరవాత 25 రోజులకు పాండవులు అంత్యక్రియలుచేశారు. 27వనాడు ధర్మరాజు పట్టాభిషిక్తుడయాడు. 29వ నాడు భీష్ముడిదగ్గరకు వెళ్లారు. ఇంకా 30 రోజులు భీష్ముడు బ్రతికాడు. మాఘశుక్లసప్తమినాడు ప్రాణాలు విడిచాడు. రోహిణీ నక్షత్రం మధ్యాహ్నం ఉత్తరాయణ సంక్రమణం. అంటే అష్టమినాడు 15 గడియలప్పుడు గణితం ప్రకారం 3190 33I20. ఇది సరిగా కలియుగారంభానికి 37 సం॥ పూర్వం. పైలెక్కలప్రకారం భారతయుద్ధం క్రీ.పూ. 3102 సం॥ గడచినట్లే తేలుతున్నది. (44-47 పే)

కాళిదాసు రఘువంశంలో పరమరహస్యంగా రామావతారం నిక్షేపించాడు. వాల్మీకి రావణవధఘట్టంలో పెక్కువిషయాలు పాఠకుని ప్రతిభకే వదిలాడు. రామాయణంలో ఏమతం చెప్పబడలేదు. అన్నిదర్శనాలూ చెప్పబడినాయి. భారతమొక సర్వవిజ్ఞానకోశం. వేదంలోని అనేకకథలు వ్యాఖ్యానాలుగా వ్రాయబడినాయి. (53, 54 పే)

మననాగరికత వైయాసికి. మనసర్వధర్మాలు వ్యాసోపజ్ఞకములా అనిపించును. 'రామాయణమహాభారతములు అజ్ఞుడైన మానవునినుండి పరమవిజ్ఞుడైన మానవునివరకు సమాకర్షింపబడుటకు యోగ్యమైన సర్వాల్పమహావిషయలక్షణ సామగ్రీసంపూర్ణములైయున్నవి.' అని అన్నారు విశ్వనాథ.

ఈ విధముగా వారివిమర్శ బహుముఖంగా సాగి వారి ప్రజ్ఞావిశేషములను వేనోళ్ళచాటుచున్నది.

మొత్తంమీద పరిశీలించగా వారి విమర్శ ఒకప్రత్యేకస్థానం ఆక్రమించుకొన్నది. నిర్మొగమాటంగా వ్రాయదలచిన విషయం వ్రాయడం, ఏవిషయమైనా కూలంకషంగా చర్చించి గుణదోషవిచారణ చేయడం, సూక్ష్మదృష్టితో పరిశీలించి విషయం సర్వులకూ కరతలామలకం కావించడం వారిప్రత్యేకత. వారి పద్య రచన ఎంతప్రౌఢంగా ఉంటుందో వారి వచనరచనకూడా విమర్శకు సంబంధించి అలాగే ఉంటుంది. విభక్తిప్రత్యయాలు ముఖ్యంగా 'యొక్క' ఎక్కువగా వారి వచనరచనలో విడవకుండా అంటే సమాసంచేయకుండా వాడబడుతుంది. ఇది ఒకవిశేషం. దానివల్ల కొన్ని అశ్లీలంగా వినబడే పదాలలో పుంప్వాదేశం వంటివి విడవడానికి అవకాశం కలుగుతుంది. వారు కేవలం గ్రాంథికమేకాక వ్యావహారికభాషకూడా ధారాళంగా ప్రయోగిస్తారు. ఇది మరోప్రత్యేకత.

విశ్వనాథవంటి సద్విమర్శకులు ఈనాడు ఆంధ్రలోకంలో చాలతక్కువ అనేచెప్పాలి. అది మనదురదృష్టం. మల్లినాథ సూరి లేకపోతే కాళిదాసాది మహాకవులు లేరు. అందుకే విమర్శకుడు ప్రతి కవికీ కావాలి. దీనికి ఆనాడు, ఈనాడు అనేభేదంలేదు. ఎప్పుడూకావలసిందే !

విశ్వనాథవంటి సద్విమర్శకులను మన తెలుగుతల్లి తయారుచేయాలని ఆకాంక్షిద్దాం.

ఓం తత్సత్.

# ద్రౌపది ధర్మాద్వైతస్థితి

(గతసంచిక తరువాయి) — శ్రీ ఎం. కృష్ణస్వామి, ఎం.ఏ.

ఇంటికి వచ్చిన ద్రౌపదిని ఇదే అవకాశమని కీచకుడు వికారప్రదర్శనలతో మొదలుపెట్టి పెనగులాడు స్థితికి పెరిగినాడు. ద్రౌపది విదలించుకొని పారిపోయి వచ్చి రాజసభలో ప్రవేశించినది. ప్రవేశించబోవుచుండగా సిగ్గులేక కీచకుడు వెంటబడి వచ్చి తూలిపోలి పోవుచున్న యామెను సొంతము చేసికొనుటకు ప్రయత్నించినాడు. సూర్యునిచే కల్పింపబడిన రాక్షసుడు వెంటనే కలుగజేసికొని కీచకుని చావమోదినాడు. మనిషి కనబడడు_దెబ్బా-చావుదెబ్బ తగిలినది. కీచకుడు గతుక్కు మనినాడు. అయినను అంగములను కూడ దీసికొని ద్రౌపదివెంట నడచినాడు. ద్రౌపది శారీరకమైన శక్తిని పూర్తిగ కోల్పోయినది. మానసికముగ తుపానులో కొట్టుకొని పోవుచున్నట్లున్నది. నిలబడలేకున్నది. నిలద్రొక్కుకొనలేకున్నది. ఇట్టిస్థితిలోనున్న ఆమెను, ఆమెవెంటనున్న కీచకుని, చూచికూడ సభలో ఎవ్వరును మాటాడలేకపోయిరి. రాక్షసునిచే దెబ్బతిన్నాడు గనుక కీచకుడు అయోమయమున నుండిపోయినాడు కాని, అతిక్రమించి వాడేమైన చేసినను సభలోనివారు మాటాడుదురు రని చెప్పలేము. ద్రౌపది ధర్మమే ద్రౌపదిని అంతవరకు రక్షించినది. ఒళ్ళు తెలియని ఆవేశప్రయాసలతో ఊగిసలాడుచు, ద్రౌపది కలుగజేసికొననందుకు సభ్యులను నిందించినది. విరాటుని నిలదీసినది. విరాటుడు కొంచెము ధైర్యము తెచ్చుకొని సాంత్వనవచనములాడి కీచకు నప్పటికి సాగనంపి సంతృప్తిపడినాడు. నిజమునకు కీచకుడు వెళ్ళిపోవుటకు విరాటుని వచనములు కారణములుకావు. రాక్షసుని దెబ్బ కారణము. ఈస్థితిని జూచుచున్న భీముడు అపరరుద్రుడై, అక్కడనున్న పెద్దచెట్టు నొకదానిని పెల్లగించుచుండగా "వంటకట్టెలకొరకు వేరేచెట్లు దొరకలేదా?" యని ధర్మరాజు అతనిని వారించినాడు. ద్రౌపది కీచకుడు వెళ్ళిపోయినను అచటి నుండి కదలలేక పోయినది. ఆమెమనస్సు ఆమె వశమునలేదు. ఆమెస్థితి ఆమెకే అంతు పట్టుటలేదు. మొదటి నుండియు కనివిని యెరుగనిపరాభవములకు ఆలవాలమైనది ఆమె జీవితము. చరిత్రలో ఏయాడది కనివిని ఎరుగని పరాభవములు, ఊహాకందని రీతిలో ఆమె పాలబడుచున్నవి. వస్త్రాపహరణ సన్నివేశము గుర్తుకువచ్చి ఆమె హృదయమును కోసివేయుచున్నది. ధర్మజుడు జూదమాడుట తన కా పరాభవమును కొనితెచ్చినది. నేడీ యజ్ఞాతవాసమున కీచకుడి పాలబడుటకు కూడ అజూదమే కారణము. ధర్మాధర్మములను విచారించు స్థితిలో ఆమె యిప్పుడులేదు. జూదమాడుట, వస్త్రాపహరణము, ఇప్పుడీ కీచకుడు కన్నుమిన్నెరుగక ప్రవర్తించుట, మొదలగు సన్నివేశములు ఆమె కన్నులలో గిర్రున తిరుగుచున్నవి, ఏమిటీ యీస్థితి? ఎందుకు వచ్చినది ? ఎందుకీ పరాభవములు తన్ను వెంబడించుచున్నవి ? ఇంతటి పరాభవములు జరుగుచున్నను ఆనాటిసభలోగాని, ఈనాటిసభలోగాని యేయొక్కరు పలుకరేమి ? ఇది ధర్మము, ఇది అధర్మము అని చెప్పువారు ఒక్కరైన లేరా ? నాపై లోకమునకు కరుణయున్నట్లే కనిపించుటలేదు. ఇది యామెలో జరగుచున్న భావసంఘర్షణ. ఆమెకు కళ్ళు తిరుగుచున్నవి. తిరుగుచున్న కళ్ళు నీళ్ళు చిమ్ముచున్నవి, శరీర మూగిపోవుచున్నది. సభలో ఏమి జరుగుచున్నది యామెకు తెలియదు. సభాసదులందరు సభలో ఆమెనుగూర్చి రకరకములుగ అనుకొనుట మొదలుపెట్టి

నారు. ఇకనిక్కడ నీవుండుట మంచిది కాదని ధర్మజుని కనిపించినది. ఆసన్నివేశమున తట్టుకొని నిలబడినది ధర్మజుడొకడే. జరిగిన సన్నివేశమునకు అతని హృదయము వేదన ననుభవించినది. రోషము పెరిగి ఫాలమంతయు చెమట నిండినది. కాని సమయముకాదని తన్ను తాను వారించుకొని తనకు తానుగా నిలద్రొక్కుకొని తన మామూలు గొంతులో ద్రౌపది కిట్లనినాడు. "ప్రభువు, ఈసభలోని వారందరు, నీస్థితియంతయు అర్థము చేసికొనిరి. నీవింకను మాటలాడుట యెందుకు? సుధేష్ణ సదనమునకు పొమ్ము. గంధర్వులు నీకు జరిగిన పరాభవమునకు కోపింపరా? నియమ మేదైన నీకును వారికినున్నచో, ఇచ్చట కోపింపరు. కావున భర్తలను నిందించరాదు. సతికి సభలలో నిట్లు నిలిచి ధిక్కరించుట తగునా చెప్పు" అన్న ధర్మజుని పలుకులు వినియు ద్రౌపది ఆ చోటునుండి కదలక యింకేదియో మాటలాడ బోవుచుండగా, ధర్మజుడు "పలుపోకలబోవుచు విచ్చలవిడి నాట్యము చూపు చాడ్పున నిచ్చట కులసతులకు తలవంపు కలుగురీతిలో నుండ వచ్చునా? అనినాడు. ద్రౌపది ఆ మాటలు విని తా నట్లుండుట తగదని తెలిసియు, తన స్థితి నతడు అర్థము చేసికొనలేదనుబాధతో సానుభూతిని కోరుచున్న స్థితిలో ఆక్షేపణలు ధర్మజునినుండి లభించినందుకు నొచ్చుకొని యిట్లన్నది. "నాభర్త నటుడు. నిజము పెద్దవారి వలెనే చిన్నవారుకూడ. కనుక నేనును నా పతులవలెనే కంకుభట్టు నన్ను శైలూషి వని చూపనక్కరలేదు. కావున నాకు నాట్యము పరిచయము. అదియుగాక నా భర్త కేవలము నటుడే కాదు జూదరికూడ. జూదరి యాలికి గౌరవ మెక్కడిది? అని యచటినుండి వెడలిపోయినది. మందలించనిచో ఆమె అచటినుండి కదలునట్లులేదని ధర్మజుడు ఆమె నట్లన్నాడు. అంతేకాని అత డనవలెనని యనలేదు. ఆసత్యము ద్రౌపదికి కూడ తెలియును. కాని ఆమె వివేకమును ఆమెలోని బాధావేశము మించి వేసినది. ఆమెలో పొంగి పొరలుచున్న వేదనావేశము గాల్చిన అక్షరాకృతియే యీ మాటలు. అంతేకాని ధర్మజుని నిందించుట కాదు. ఆసంగతి యొక్క ధర్మజునకే తెలియును. భార్యాభర్తల హృదయములు ఇతరులకు తెలియవనుట యిచ్చట సత్యము. ఆమాటలు విని ధర్మజుడు జాలిపడి యుండును గాని, బాధపడి యుండడు. నా మూలకముననగదా యీమె కిట్టిస్థితులు ప్రాప్తించుచున్నవని అతడుకూడ వేదన ననుభవించియుండును. ఎంతవేదన యున్నను ధర్మోత్తరుడు గావున ధర్మజుడు బయటపడడు. వేదన వెల్లుబికినదిగాన ద్రౌపది వివశయై మాట్లాడినది.

సుధేష్ణ యింటజేరిన ద్రౌపదిని సుధేష్ణ జరిగినది తనకు తెలియనట్లు 'ఏమి జరగిన' దని ప్రశ్నించిన తెలిసియు తెలియనట్లడుగుచున్న యామెకు జరగినది చెప్పినది. సుధేష్ణ కీచకుని దండితునిజేయుదునని అనునయ వాక్యములు పలుకగా "నీకింతశ్రమ మక్కరలేదు. పగతీర్చుకొనుటకు నాభర్తలు కలరని చెప్పినది. ఆమాటకు సుధేష్ణ హృదయము హడలినది. పరిజనములు నివ్వెరపోయిరి. సుధేష్ణ కొన్ని సాంత్వన వచనములాడినది. కాని ద్రౌపది తేరలేదు. స్నాన భోజనాదులాచరింపలేదు. మెల్లగా పడకగది చేరి శరీరమును ప్రక్కపై పడవైచినది. కన్నులనుండి రాలు నీటితో చెక్కుల కొలంకులు నిండిపోవుచుండగా ఆవేశస్థితినుండి తన మనస్సును మెల్లగా నామె కర్తవ్యస్థితికి తెచ్చుకొన్నది. "భీము డొక్కడే కీచకుని చంపగలవాడు. దైవబలమును అతనికి తోడుకాగలదు. ఇది హృదయమునుండి ద్రౌపది కందిన సందేశము. మెల్లగా లేచి, ఒళ్ళు కడిగికొని, తెల్లని వస్త్రము కట్టుకొని, వంటసాలలో నున్న భీముని కడకేగినది. మెల్లగా భీముని నిద్రలేపినది. ఇట్టిస్థితిలో ఏ మానిద్ర యని మందలించుచు, అత డడుగగా జరగిన కథ యంతయు కష్టముగా చెప్పినది. ఇంత జరగినప్పుడు గూడ ధర్మరాజు ఎట్లూరకుండగలిగినా డన్నది. భీముడు "అప్పుడు ధర్మజుడే వారింపకున్నచో కథ మొదటికి వచ్చెడిది సుమా! కనుక ధర్మజుడు పొగడ దగినవాడుకాని తెగడ దగినవాడుకాదు. కీచకుని చంపుట పెద్ద విషయము కాదు. రహస్యముగా చంపు విధ మాలోచింపవలసియున్నది" అనెను. మాటలు విని ద్రౌపది "కుంతి యన్న నాకు వెరపులేదు. మీరన్న నాకు వెరపులేదు. దైవమున్నను వెరపులేదు. కాని విరటుని కాంత యన్నచో ఎంతో వెరపు కలుగుచున్నది." అనుచు సభలో ధర్మజునితూలనాడినఆవేశస్థితినిగూర్చి యిట్లు చెప్పినది.

"కినుకకుఁ జాలకెంతయును
గీడ్పడి నాపడుపాటు లెల్ల వ
మ్మునఁగలయంగ నిట్టులొక
మూర్ఖునిచేఁ గుదిఁబోయికోలుపో
యెనె యభిమాన మన్యగపు
నేడ్తెఱ డెందము కొందలంబుఁ బొం
దిన ధృతిమాలి యేఁబలికి తిం
దగవెల్ల నెఱింగియుండినన్"

(విరాట 2-286)

సత్యము తెలిసి యుండియు కూడ హృదయ వేదన నాపుకొనలేక పలికినది గాని ధర్మజుని స్వరూపము తెలియక కాదు. ఆపైని ధర్మజుని గూర్చి అతని శీల వైభవమునుగూర్చి, తలచి పరవశించి, అతని గుణగణములను కీర్తించి, అప్పటికి తృప్తిపడినది. ఆవేశములకు అతీతుడైన యాతని స్మరణచేసి తానావేశము వలన చేసిన కొద్దికప్పును తనకు తానుగా పోగొట్టుకొన్నది ద్రౌపది. కీచకుడు అవమానించిన సందర్భమున ఆమెకు భర్త

ందరిపైని ఆవేశపూర్వకమగు కోపము లిగినది. నిజమునకది సత్యముకాదు దా! కనుక మిగిలిన నలుగురిని కూడ త్రించి వారివారి నిజ స్వరూపములను నస్సున నిలుపుకొని తృప్తి చెందినది ౌపది.

కొద్దిగంటల కాలములో ద్రౌపది ప్రవ నలోవచ్చిన యీమార్పు గణనీయమైన ది. ఆవేశముతో నూగిపోవుచు సభ ుండి వెలువడిన యామె అంతఃపురము కువచ్చి తన ప్రక్కపై శరీరమును చేర్చి నప్రవర్తనలోని తప్పొప్పులను తానే ర్శించి ఆవేశపడుటవలన నుపయోగము లేదని, పైగా, అజ్ఞాతవాసమునకే ముప్పు చ్చునని, అందువలననే ధర్మజుడు మునిని తన్ను వారించినాడని దర్శించి మనస్సును ప్రశాంతపరచి, ఆవేశస్థితినుండి ర్తవ్యనిర్ణయస్థితికి మనస్సును తీసుకొని వచ్చినది. భీముడు కీచకుని చంపగల డనియు, దైవ మాతనికి తోడుకాగల దనియు ఆమెకు వెంటనే స్ఫురించినది. స్ఫురించిన ప్రణాళికను ఆచరణలో పెట్టుటకు వెంటనేలేచి తగురీతిని భీముని చేరినది. ఆతనికి విషయము తెలియజెప్పి, ఆవేశమున తాను పొందిన వికారమునకు భీముని యెదుటనే తగిన ప్రాయశ్చిత్తమును చేసికొన్నది. ఆపైని భీముని ప్రణాళిక ప్రకారము కీచకుని నర్తనశాలకు రప్పించి, ఆతని సంహరింప జేసినది. ఆపైని కోరి యగ్నిని ముట్టినట్లు ఆమెను ముట్టుకొని యుప కీచకులు కూడ చంపబడిరి. కనుక ఈ సందర్భమున ద్రౌపది పాత్రను మనము మనస్సులో స్పృశించుట కాక హృదయములో దర్శింప వలసియున్నది. మన రాగద్వేషముల కామె పాత్రను బలిపెట్టుటకాక నిర్మల చిత్తముతో మనహృదయ పీఠికపై కామెనావాహనము చేసి, ఆమెను గూర్చి ఆమెయే చెప్పగా వినవలసియున్నది.

—0—

# పురుషార్థ సుధానిధి

పతివ్రతా ధర్మకథనము (షష్ఠాధ్యాయము)

మూలము . శ్రీ సాయణాచార్యులు

ఓ మునీశ్వరులారా, పరమరహస్యమైన యీసంగతి వినుడు. స్త్రీలకు పాతివ్రత్యమునకు మించిన ధర్మము లేదు. వ్రతోపవాసముల చేతను, వివిధధర్మాచరణముల చేతను స్త్రీ పొందజాలని స్వర్గమును పతిపూజవలన నామె పొందగలదు. ఎవని గృహమునఁ బతివ్రత విలసిల్లుచుండునో యాతడుకూడ నుత్తమమైన కీర్తిని స్వర్గమును బడయఁగలఁడు. మహాత్ముడైన అగస్త్యునకుఁ బృహస్పతి తెలిపిన వృత్తాంతము వివరింపబడుచున్నది.

లోపాముద్రాప్రియంకరుఁడవైన ఓ యగస్త్యమహర్షి! నీవు ధన్యుఁడవు. మహాత్ములకును మాన్యుడవు. ప్రత్యాశ్రమమునను, ప్రతినగమునను, ప్రత్యరణ్యమునను, తపోధను లనేకులు లేకపోలేదు. కాని నీస్థితియందలికంటెను విశిష్టమైనది. నీయందు తపోలక్ష్మి యున్నది. బ్రహ్మతేజస్సు గలదు. పుణ్యసంపద గలదు. ఔదార్యము గలదు. కథాశ్రవణమాత్రమున సుకృతముగల్గించు మంగళస్వరూపిణి యీలోపాముద్ర నీకు సహధర్మచారిణియై యొప్పుచున్నది.

పతివ్రతలలో అరుంధతి, సావిత్రి, అనసూయ, శాండిల్య, సత్య, లక్ష్మి, శతరూప, మేన, సంజ్ఞ, స్వాహాదేవి, లోపాముద్రకు సాటిరారనుట నిశ్చయము.

నీవు భుజించినపిమ్మట భుజించును, నీవు కూర్చున్న వెనుకఁగూర్చుండును. నీవు నిద్రించిన యనంతరము నిద్రించును. నీవు మేల్కొనక ముందు మేల్కొంచును. ఎన్నడు నిరలంకృతగా నీకుఁ గానఁబడదు. కార్యార్థము నీవూరికేగిన పుడాభరణము లన్నియు వర్జించును. నీ యాయుష్యవర్ధనము గోరునది యగుటచే నెన్నఁడు నీపే రుచ్చరింపదు. పరపురుషుని నామమును నెన్నఁడుఁ బేర్కొనదు.

పతివ్రత పతి నిందించినను బ్రతినింద సేయదు. కొట్టినను బ్రసన్నత వీడదు. చేసినదానిని మన్నింపగోరును. ఇంటిపనులలో నిమగ్నురాలై యుండియుఁ బిలువగనే యాదరముతో దరికి వచ్చి 'అనుగ్రహించి పిలిచినపని తెల్పు' మని యడుగును. ఎక్కువసేపు ద్వారముకడ నిలువదు. భర్తఅనుమతిలేనిదే ఎవరికినేమియు నీయదు.

చెప్పనక్కరలేకుండగనే నియమోదకము, దర్భలు, పత్ర పుష్పాక్షతాదులు నగు పూజాద్రవ్యము లన్నియు సంపాదించును. అవసరమును గమనించి కాలానుసారముగా నన్నియు సంతుష్టమనస్కురాలై సమకూర్చును. పతి భుజింపగా మిగిలిన మృష్టాన్నమును ఫలాదికమును సేవించును. పతి యొసగినదానిని మహాప్రసాదముగా స్వీకరించును.

దేవ పిత్రతిథులకు సమర్పింపవలసినది సమర్పించి పరిచారకులకు, గోవులకు భిక్షుకులకు, నొసగనిదే తాను భుజింపదు నేర్పున గృహసామగ్రి భద్రపఱచుకొని సంతుష్టురాలై యనవసరవ్యయ మొనర్పనిదై యొప్పుచు పతి యనుమతిలేనిదే ఉపవాసాదికవ్రత మాచరింపకుండును.

పతివ్రత సమాజోత్సవ దర్శనమును దూరముగ విసర్జించును. తీర్థయాత్రాదులకుఁబోదు. పెండ్లిండ్లుచూడఁగోరదు.

స్వేచ్ఛగా సుఖనిద్రలోనున్నట్టి, సుఖముగ గూర్చుండి యానందించుచున్నట్టి భర్తను తొందరపనులకొఱకైన లేపగొట్టదు. ఋతుధర్మమునను న్న మూడ రోజులు తనముఖమును భర్తకుఁ గనఁబ

వగు. స్నానమున శుద్ధురాలగు వఱకు తనమాటలను భర్తకు వినిపింపదు. సుస్నానమొనరించి భర్తముఖముఁ జూచును గాని యెన్నడు నితరుని మొగముఁజూడదు. లేదా భర్తను ధ్యానించుకొని సూర్యుని దర్శించును.

పతివ్రత పసుపును, కుంకుమను, సిందూరమును, కాటుకను, అవికను, తాంబూలమును, శుభప్రదమైన మంగళసూత్రమును, భర్త ఆయుష్యమును గోరునదియై యెన్నడు దూషింపకుండును. (ధరించును) తలదువ్వుకొని కొప్పువెట్టుకొనును. గాజులను, కర్ణవిభూషణములను ధరించును.

చాకితతోను, నీరువోయు స్త్రీతోను, నీచస్త్రీతోను, గయ్యాళితోను నెన్నడు చెలిమి సేయదు. భర్తృవిద్వేషిణియైన భార్యతో నెన్నడు నీమె సంభాషింపదు. ఎన్నఁడు నేకాకినిగా నుండదు. వివస్త్రయై స్నానముచేయదు.

ఱోటిమీదను, రోకలిమీదను, చీపురుమీదను, రాతిమీదను, యంత్రముమీదను, గడపమీదను, నెన్నడుఁ గూర్చుండదు. రతిసమయమునఁదప్ప జాణతనము జూపదు. భర్త కేయేవిషయములఁ బ్రీతియుండునో తానును వానియందుఁ బ్రియముఁ జూపును. భర్తృవాక్యోల్లంఘనము చేయకుండుటే స్త్రీలకు గొప్ప వ్రతము, ఉత్తమమైన కర్తవ్యము, ప్రశస్తమైన దేవపూజయు నగును.

పౌరుషహీనుడుగాగాని, దురవస్థలో నున్నవాడుగా గాని, వ్యాధిపీడితుడుగా గాని ముసలివాడుగాగాని, యెట్టిస్థితిలో నున్నను పతిమాట జవదాటరాదు. భర్తకు సంతసముగలిగినపుడు తాను సంతసింపవలెను. ఆతని విషాదములోఁ బాలు పంచుకొనవలెను. ఆపత్సంపత్సమయములందొకే భావముఁ జూపు నామె పతివ్రత యగును.

నేయి, ఉప్పు, నూనె మున్నగు వస్తువులు నిండుకొన్నను పతివ్రత లేదని భర్తతో ననరాదు. ఆతనికి శ్రమ కలిగింపరాదు. తీర్థస్నానముఁగోరు స్త్రీ పతిపాదోదకము పానము సేయవలెను. స్త్రీకి శివునికంటెను విష్ణునికంటెను భర్తయే యధికుడు. పతి నతిక్రమించి వ్రతోపవాసాదిక మొనరించు స్త్రీ పతి యాయుర్దాయమును హరించును. మరణానంతరము నరకము నొందును.

భర్తకంటె నితరులనుండి యుపదేశము నొందిన స్త్రీ అయోగ్యురాలై రౌరవనరకము నొందును.

క్రోధపరాయణురాలై భర్త కెదురు పలుకు స్త్రీ గ్రామమున నాడుకుక్కయై జనించును లేదా నిర్జనవనమందు నక్కయై పుట్టును. కృతనిశ్చయముతో పతిపాదములను సమర్చించి యనంతరము భుజించుట స్త్రీలకుఁ బరమవ్రత మని చెప్పబడినది.

ఉన్నతాసనమునఁ గూర్చుండరాదు. పరుల యిండ్లకుఁ బోరాదు. ఎన్నఁడు లజ్జావహములైనమాటలు పలుకరాదు. అపవాదులు వేయరాదు. కలహమును దూరముగ విడువవలయును. పెద్దల సన్నిధి నెన్నడు గట్టిగా మాటలాడరాదు, పెద్దగా నవ్వదగదు.

భర్తనువీడి రహస్యవర్తనము నడపు దుష్టురాలు చెట్టుతొఱ్ఱ నాశ్రయించు ఆడు గుడ్లగూబయై పుట్టును. భర్తకొట్టిన మరల కొట్టగోరునది ఆడుపిల్లి లేక ఆడుపులి యగును. పరపురుషుని క్రీగంటఁ జూచు స్త్రీ మెల్లకంటిది యగును.

ఏ స్త్రీ భర్తను విడిచి తా నొక్కతెయె మృష్టభోజన మొనరించునో యామె గ్రామమునఁ బందికాని, ఆడుబొజ్జింక కాని, శ్వానముల భక్షకి కాని యగును. భర్త నుద్దేశించి హుంకరించి పలుకునది మూగదియై పుట్టును. సవతుల యెడల నీర్ష్యవహించు నామె మరల మరల భర్తృపరిత్యక్త యగును. భర్తకను గప్పి మఱొకనిఁ బ్రీతితోజూచు నామె యొంటికన్నుగలది (కాకి) యగును. లేదా కురూపిణి యగును.

వీధిలోనికిఁ బోయి వచ్చుచున్న మగనిఁజూచి తొందరగా పీఠమువైచి తాంబూలమిచ్చి వీవనలతో విసరి పాదములొత్తుట మున్నగు నుపచారములు గావించి యాతని కానందము గలిగించు నామెవలన ముల్లోకములు సంతుష్టి నొందును.

తండ్రి మితముగా నొసగును, తల్లి మితముగానిచ్చును, సుతుఁడును మితముగ నొసఁగును. అమితప్రదాతయగు భర్త నెవతె పూజింపకుండును? భర్త దైవము, గురువు, ప్రసిద్ధములైన ధర్మతీర్థము లతఁడే కావున సమస్తముఁ బరిత్యజించి భర్త నొక్కని సమర్చింపవలయును. జీవహీనమైన దేహము క్షణములో నపవిత్రమైనట్లు భర్తృహీనయగు నారి చక్కగా స్నానము చేసినను, నిత్యము నపరిశుద్ధురాలే యగును. సమస్తములైన అమంగళములలోను వితంతు వమంగళతరము. విధవాదర్శనమున నెన్నడును కార్యసిద్ధి కలుగకుండఁ బోవును.

తల్లిని దప్పించి సర్వమంగళవర్జితురాలైన విధవ యాశీర్వాదమునుగూడ ప్రాజ్ఞుడైనవాడు క్రూరసర్పమునువలె విసర్జింపవలెను. వివాహసమయమునఁ బురోహితులు కన్యచే "జీవితుడయినను, నజీవితుడైనను, భర్తకు సహచరినై యుందు" నని పలికింపవలయును.

చందమామ వెన్నెలతోగూడియుండునట్లును, మేఘము మెఱుపుఁదీగతోఁ గూడియుండునట్లులు, దేహము ననుసరించి ఛాయ యుండునట్లును, పతితోడనే గమనము చేయవలయును.

సంతోషమున భర్త్రనుగమనముఁ జేసి పితృవనముఁజేరు సుందరి నిస్సంశయముగాఁ బదపదమున నశ్వమేధయాగ ఫలము నందును. పాములఁబట్టువాడు కన్నమునుండి బలవంతముగా పట్టి పైకి

లాగునట్లు కల్మషములనుండి యుద్ధరించి భర్తకు స్వర్గము గలిగించును.

పతివ్రతను దూరమునుండి చూచి యమభటులు ఆమెపతి పాపకర్ముఁడైనప్పటికి ,వదలివైచి పాఱిపోవుదురు. పతివ్రతను జూచి. భయపడినట్లుగా అగ్నికిగాని విద్యుచ్ఛక్తికిఁగాని భయపడదు.

పతివ్రతను గాంచినంతనే సూర్యుడు మందముగఁ బ్రకాశించును. అగ్నిదహింపకుండును. సకలతేజస్సులు కంపించును. తనశరీరమున రోమము లెన్నియుండునో అంతకుఁబదివేలకోట్లరెట్లు సంవత్సరములు భర్తతో స్వర్గఫలము ననుభవించుచు రమించును.

ఎవరిగృహమునఁ బతివ్రత వర్తించునో ఆతలిదండ్రులు ధన్యులు. ఆభర్త ధన్యుఁడు, నైశ్వర్యవంతుడును. మూడు తరముల పితృవంశము వారును, మూడు తరముల మాతృవంశీయులును, మూడు తరముల పతివంశమువారును పతివ్రత పుణ్యముచే స్వర్గలోకసౌఖ్యము లనుభవింతురు.

దుర్వృత్తమున శీలభంగ మొందిన స్త్రీలు మూడుతరముల పితృ మాతృ పతి వంశీయుల కిహపరదుఃఖమునఁ బతనము కలిగింతురు.

పతివ్రతల'చరణస్పర్శ'గల భూమియే సార్థక మైనది. సూర్యుఁడు, చంద్రుఁడు వాయువుకూడఁ దమపవిత్రతకొఱకైనఁ బతివ్రతలను స్పృశింప వెఱతురు. జాడ్యహారములై పవిత్రములైన జలములు సర్వవేళలఁ బతివ్రతాస్పర్శ నభిలషించుచుండును. ప్రతిగృహమునను రూపలావణ్యగర్వితలైన నారీమణులు లేకపోలేదు. కాని పరమేశ్వరభక్తిచేతమాత్రమే పతివ్రత లభించును. గార్హస్థ్యమునకు, సుఖమునకు, ధర్మఫలప్రాప్తికి, సంతానవృద్ధికిని భార్యయే మూలము. భార్యామూలముననే యిహపరములు వర్ధిల్లును. దేవపితృతిథుల నారాధించుటకు భార్యాహీనుఁడనర్హుఁడు. ఎవనిగృహమునఁ బతివ్రత యుండునో యాతఁడే గృహస్థుఁ డగును. ఇతరుఁడు క్షణక్షణము జరారాక్షసిచే మ్రింగఁబడుచుండును.

గంగాస్నానమున శరీరము పావనమైనట్లు మంగళప్రదమైన పతివ్రతాదృష్టిప్రసరణమున మిక్కిలిపవిత్రత కలుగును.

దైవవశమున భర్తననుగమింపక పోయినను శీలరక్షణ గావించుకొనఁ దగును. అట్లుకానియెడలఁ బతనముసంభవించును. శీలవైగుణ్యమువలన భర్త, తండ్రి, తల్లి, సోదరుఁడు, గృహము, కులము సర్వము భ్రష్టమగును. పతిమరణమున వైధవ్యమును పాలించిన స్త్రీ స్వర్గమున పునః భర్తనుపొంది భోగము లనుభవించును.

విధవకేశబంధము పరలోకమున భర్తకు బంధనహేతువు కాఁగలదు. కావున నెపుడును వితంతువు కేశఖండనము గావించుకొనఁదగును. ఏకభుక్త మొనరించుచు నియమశీలయై వర్తింపఁ దగును. ప్రాణముపోవు (మరణము సంభవించు) వఱకు నాహారనియమముతో జీవయాత్ర సాగింపవలయును.

విధవ పానుపునఁబండుకొన్నచోఁ బతి పతనము నొందును. పరలోకమునఁ బతిసౌఖ్యముఁగోరు విధవలు నేలమీఁదఁ బండుకొనుట యుచితము. విధవ శరీరమున నలుగువెట్టుకొనరాదు. ఏదైవము నే విధిచే భర్త యారాధించునో విధవ యా విధమునే యనుసరించి యాదైవమునే యారాధింపవలయును. భర్త ఆచరించిన వ్రతమునే యామె యాచరింపవలెను. భర్తయాచారమునువీడి యన్యాచారము నవలంబించిన వితంతువు పతిత యగును. సుగంధద్రవ్యోపయోగ మెన్నడుఁ గావింరాదు. ఆతని తండ్రి తాతల నామగోత్రాదులను జేర్కొనుచు కుశ తిలోదకములతో నిత్యము భర్తకు తర్పణ మొనరింపవలయును. పతిభావనతో విష్ణుమూర్తికి నమస్కరింపఁదగును. విష్ణుస్వరూపునిగా నిత్యము భర్తను ధ్యానింపవలయును.

పతికిఁ బ్రియమొనరించు తలంపుతో నాతనికి లోకమున నేయేవస్తువులు ప్రియమైనవో ఆయావస్తువులను గుణవంతునకు దానమీయవలయును. ఇట్టి ప్రవర్తన గలిగిన విధవయు శుభప్రదయగును. ఇట్టి యాచరణము గల్గి పరిశుద్ధురాలైన విధవ పతితోడి యుత్తమలోకములుఁబొంది దుఃఖరహితయగును.

పతిదేవతయగు నారీమణికిని, గంగాదేవికిని, భేదము కానరాదు. ఆమె సాక్షాల్లక్ష్మీదేవితోఁ దుల్యురాలు. కావున నామె పూజనీయురాలు.

భర్తృపాదాంబుజములపైఁ జూపు నిలుపు జగన్మాతవగు నోలోపాముద్రా! నీదర్శనమున గంగాస్నానఫలము లభించినది. రాజపుత్రియు, మహానుభావురాలును, పతివ్రతయు, నగు లోపాముద్ర నీవిధమున స్తుతించి యగస్త్యమహర్షికి నమస్కరించి సర్వార్థములు నెఱిఁగినవాఁడగు బృహస్పతి యిట్లనెను.

'ఓమహామునీ! నీవు ప్రణవమవు, ఈమె శ్రుతి (వేదము) నీవు తపస్సు, ఈమె క్షమ. నీవు ఫలమవు. ఈమె సత్క్రియ. నీవు ధన్యుఁడవు.నీవు బ్రహ్మతేజమువు. ఈమె పాతివ్రత్య తేజస్సు. నీకిక సాధ్యముకానిది యేముండును?'

బుద్ధిమంతుఁడైన బృహస్పతి యీవిధమున మహానుభావుఁడైన యగస్త్యునకుఁ బ్రశస్తమును, సర్వసిద్ధిప్రదమును నగు పతివ్రతాధర్మమును వివరించెను.

స్త్రీలుకాని, పురుషులుకాని, యీపతివ్రతాధర్మమువిని, పాపకంచుకమును విసర్జించి యింద్రలోకమునకు బోఁగలరు. శ్రవణమాత్రమున నెల్లపుడు సౌఖ్యకరమైన పతివ్రతాధర్మ ముత్తమోత్తమమని చెప్పుదురు. (కాశీఖండము)

# గులాబి

శ్రీ చల్లా నరసింహారావు

[సౌందర్యవంతమైన ఒక ఉదయసమయాన, నావాకిలిముందు మంచులో వికసించిన ఎఱ్ఱగులాబిపువ్వును చూచినప్పుడు నాకు కలిగినయూహ యీ పద్యములలో నింపుకొన్నాను.]

మూసిన రెప్పలో ముసురు
ముమ్మరమైన తలంపులల్లరాఁ;
ద్రోసిన; మత్తుగాఁగదలి
తొట్రిలెఁగన్నులమూలలుల్కి; త
ద్భాస శుభార్ద్రసుందరత
భారము మెల్లఁగ నిల్వ భావనా
వాసన విశ్వసృష్టివిభ
వమ్ము రహస్యమెదో వసించెడిన్.

వంచినమోము, మంచుపలి
పంపుముసుంగునసొంపునింపు; నే
నెంచుచుఁజూచినంత జిగు
లీనుచుఁ బల్లవకోణరేఖలం
దించుక, చారిమారుణిమ
యిమ్ముగఁగన్పడు; సూనసుందరీ;
చంచలమొందనీకు ముఖ
కాంతము; వేకువగాలి సోకినన్.

మొహావలుమూర్వ్వపూసిపోలు
పుల్ గల మవ్వపుఁగెంపుచెక్కిలిన్
సహజమనోజ్ఞతారుచిర
సౌమ్యములే తొలిసంజనీడలన్
వహనముపొంది భూతిలెనో;
పావనశోభలు మోయుచుంటి, మో
హాహితసువాసనాసుఖము
హాయిగ మైమఱపించు మత్తునన్.

నీగళమందు మేలుకొని
నెమ్మదిగా నెఱుపారుతావి, యే
రాగము గాఁద్రసించె నధ
రాగ్రతలమ్ము, నిగారపెక్కఁగన్;
లోఁగని, యాలకింప నపు
రూపపు 'లాలత' రాగ మాచు ! స్వ
ర్గాగమ మానచిహ్నమున,
నల్లనఁ జేరువయౌను దేలుచున్.

సాలపులంకూరుగంధిలకు
సుందరవక్త్రహాసాన్వితమ్ముగా
నొలికిన ; బొర్లిపోవఁగర
యుగ్మముఁబ్రాంజలిఁబట్టి త్రాగితిన్;
అలసినరుగ్ణచిత్తమున
నంటినక్లేశము నాశమయ్యె నా
విలమయి; ఓగులాబి; మురి
పిల్లు దుమస్సున నీదుసన్నిధిన్.

---

# నా దృష్టిలో గురజాడవారి సృష్టి

\- శ్రీ ఘూర్జని వెంకటబాలాజి



ఇక గురజాడవారి కథలనుగూర్చి ఒక చక్కనైన సింహావలోకనం చేయడం యుక్తమనుకొంటాను. అప్పారావు గారు కవిగా ఎంతటి లబ్ధప్రతిష్ఠులో, కథకులుగా అంతటి సుప్రసిద్ధులు. జాగ్రత్తగా పరిశీలిస్తే తెలుగు సాహిత్యంలో 'కథ' అనే వినూత్న ప్రక్రియ గురజాడవారితోనే ప్రారంభమైనదని చెప్పవచ్చును. కందుకూరివారు అన్ని సాహిత్యప్రక్రియలకు నాంది పలికి నప్పటికనీ కథవిషయంలో తగు శ్రద్ధ వహింపలేదు. అందుచేత కథారచనలో గురజాడవారే ప్రామాణికులయ్యారు. అయితే కొంతమంది విమర్శకులు ఆచంట వేంకట సాంఖ్యాయనశర్మ గారి 'లలితకథ' అన్ని కథాలక్షణాలు సంతరించుకొని తెలుగు కథాసాహిత్యానికి నాందిపలికిన తొలి తెలుగుకథ అంటారు. కాని యీకథ 1910 దాటాకే ప్రచురింపబడింది. దీనికి ముందుగా అంటే 1910 లో గురజాడవారి తొలితెలుగుకథ 'దిద్దుబాటు' ప్రచురింప బడింది. 1910 ముందుగా 'ప్రొద్దుతిరుగుడుపూవులు' అనే పేరుతో తిరుపతి వేంకటకవులు ఒక కథల సంపుటిని ప్రచురించారు కాని వానిలో కథలకు ఉండవలసిన లక్షణాలు లేవు'

గురజాడవారి 'దిద్దుబాటు' కథ సంపూర్ణకథా లక్షణాలు కలిగియున్న కథ. కథకు ఉండవలసిన మూడు లక్షణాలలో కథ పెద్దదిగా ఉండకూడదు. ఒక ఊహించని మలుపుతో కథ ముగియాలి, దీనివలన ఒకసందేశం రావాలి అనేవి ముఖ్యమైనవి. ప్రస్తుతకథలో ఆమూడు లక్షణాలు పూర్తిగా సంతరించుకొన్నాయి. 'దిద్దుబాటు' కథలో సరళ ప్రధాన పాత్రధారిణి. ఆమె దుర్వ్యసనాలకు లోనై యింటికి దూరంగా సంచరించే తనభర్తను సత్ప్రవర్తకునిగా చేయాలనే ధ్యేయంతో ఒకచిన్న నాటకమాడుతుంది. చిన్నఉత్తరం ఒకటిరాసి పడకగదిలోని దిండు క్రిందపెట్టి నౌకరు రంగన్నకు చెప్పి అమ్మగారింటికి వెళ్ళిపోతుంది. తరువాత కొంతసేపటికి భర్తవచ్చి, భార్య చేసినపనికి చింతిస్తూ తనపరువు ప్రతిష్ఠలు భార్య అత్తవారింటికి పోవడంతో మంటకలిసిపోయినాయి గదా యని బాధపడుతూ, అత్తవారింట్లో తన్ను అందరు చాలా చులకనగా చూస్తారని వాపోతూ నౌకరు రంగన్నతో జరిగిన విషయాలన్నీ ఏకరువుపెట్టి మిక్కిలి పరితపిస్తాడు. భార్యవస్తేచాలు ! తాను క్షమాపణ చెప్పుకొంటా నని మిక్కిలి వగరుస్తాడు. ఆసందర్భంలోనే అతడు కూర్చున్న పడకటింటి మంచంక్రిందనుంచి సరళ వెలుపలికి వచ్చి భర్తను ఊరడిస్తుంది. అంతటితో కథ ముగుస్తుంది కథ చదివిన వెంటనే పాఠకులు ఇ(

చక్కనికథ అనే భావాన్ని పొందగలుగుతారు.

ఇది గురజాడవారి తొలి తెలుగుకథ. దీనితరువాత మరికొన్ని కథలు వచ్చాయి. అందులో 'పెద్దమసీదు' 'మెటిల్డా' 'మనుషులు చేసిన దేవుళ్ళారా!, దేవుడుచేసిన మనుష్యుల్లారా! మీ పేర్లేమిటి?' వంటి ఉత్తమకథలు పేర్కొనదగినవి. ఇవన్నీ కూడా 'ఆణిముత్యాలు' అనే శీర్షిక క్రింద ఒక కథల సంపుటిగా వచ్చినవి.

మెటిల్డాలో మెటిల్డా మిక్కిలి అమాయకురాలు. వయసులో చిన్నది. లోకజ్ఞానం ఏమాత్రంలేని ఆమెకు ఒకవృద్ధునితో వివాహమైంది. ఒకరోజు ఆమె దురదృష్టవశాత్తు ఒక యువకునితో మాట్లాడుతుంటే, ఆవృద్ధుడు చూచాడు. అప్పటినుండి ఆమెను ఒకకంటకనిపెడ్తూ ప్రతివిషయంలో ఆమెను అనుమానిస్తూ అవసరమొచ్చినపుడు పగసాధించాలనే నెపంతో అతడు ఎదురు చూస్తుంటాడు. ఆమె భర్త విపరీతప్రవర్తనకు కుమిలిపోని రోజుఅంటూ ఉండదు.

పెద్దమసీదు కథలో పలురకాలైన మనస్తత్వాలను గురజాడవారు నేర్పుతో చిత్రించారు. ఇది వివిధ మతాలకు, అందులోని పలుకులాలకు, మనస్తత్వాలకు కూడలి. సర్వమానవ సౌభ్రాత్రాన్ని వ్యక్తం చేయడానికి ! కాబోలు గురజాడవారు ఈకథ రాశారు అనే భావం పాఠకులకు తప్పక కలుగుతుందనడంలో ఎటువంటి ఆశ్చర్యంలేదు. అదే విధంగా దేవుడుచేసిన మనుష్యుల్లారా! మనుషులు చేసిన దేవుళ్లారా! మీ పేర్లేమిటి? అనే కథకూడా ఇంచుమించుగా అభ్యుదయ భావాలతో రంగరింపబడినది.

'ఆణిముత్యాలు'కథలసంపుటిలోవచ్చిన కథలు కాకుండా గురజాడవారు విడిగా కొన్ని కథలను వెలువరించారు. మొత్తం మీద గురజాడవారికథలు ఆనాటి కథా సాహిత్యానికి క్రొత్తవెలుగులు సంతరింపజేశాయని చెప్పుటకు ఎటువంటి అభ్యంతరమూలేదు. ఒకవిధంగా కథారచనలో గురజాడవారిచేత ప్రభావితులై తరువాతి తరంలో ఉత్తమకథలను రచించినవారిలో శ్రీ చింతాదీక్షితులు, శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి, శ్రీనివాస శిరోమణి, గుడిపాటి వేంకటాచలం వంటివారు అగ్రగణ్యులు. వీరందరిలోకి గురజాడవారి కథారచనను పూర్తిగా ఆకళించుకొన్నవారు చింతా దీక్షితులుగారు. వీరి 'ఏకాదశి' కథలసంపుటిని అందుకు ఉదాహరణప్రాయంగా స్వీకరించవచ్చును.

కవిగా, కథకులుగా కంటె నాటకకర్తగా గురజాడవారు సాహిత్యలోకంలో మహోన్నత శిఖరాలను దర్శింపజేశారు. సాహిత్య ప్రక్రియలలో 'నాటకం' విలక్షణమైంది. ప్రాచీనసంస్కృత సాహిత్యంలో మనకు రసవత్తరమైన నాటకాలు కన్పిస్తాయికాని, ప్రాచీనాంధ్ర సాహిత్యంలో రసవత్తరమైన నాటకాలు కన్పించవు. ఆధునిక సాహిత్యంలో నాటక ప్రక్రియావిధానంకూడా కందుకూరి వారితోనే ప్రారంభింపబడింది. 'శాకుంతలము' వారి సర్వోత్కృష్టమైన నాటకానువాదం. ఇతివృత్తం, పాత్రలు, మొదలగునవి సంస్కృత సాహిత్యానికి సంబంధించినవి కావున రచయిత మేధాశక్తి ఎక్కువగా వ్యక్తమగుటకు అవకాశం లేదు. పైగా అప్పటికి పాశ్చాత్య కవితా ధోరణులు తెలుగు సాహిత్యంలోనికి బాగా చొప్పింపబడి నప్పటికిని స్వయం సంపూర్ణమైన స్వతంత్ర నాటకానికి తెలుగు సాహిత్యం నోచుకోలేదు. అందువలన 1897 లో మొదట ప్రచురింపబడిన 'కన్యాశుల్కం' వంటి మహోన్నతమైన దృశ్యకావ్యంతో గురజాడవారు వెలుగులోనికి వచ్చారు. అది తుదకు ఎంత వరకు దారితీసిందంటే 'కన్యాశుల్కం అంటె గురజాడ, గురజాడంటే కన్యాశుల్కం' అనేనానుడి సాహిత్యలోకంలో శాశ్వతంగా నిలచింది.

ఇంతకీ 'కన్యాశుల్కం' నాటకం ద్వారా ఆయన చిత్రించిన పాత్ర లేమిటి? అందులో ఆయన చెప్పదలచుకొన్న అంశాలేమిటి? అనే ప్రశ్నలు సహజంగా ఉత్పన్నమౌతాయి. ఇందులో పాత్ర లన్నిటికి తలమానికము వంటిది 'మధురవాణి' పాత్ర. ఆమె ఒకవేశ్య. అయితే వేశ్యాజీవితంమీద రోసి| తాను ఒకసంప్రదాయ కుటుంబీకునకు అర్ధాంగియై, సుతాన్ని పొంది ఆదర్శమైన గృహిణికావా. లనే సత్సంకల్పం కలిగియుంటుంది. అయితే ఆమెను అనుక్షణం వెంటాడి వెంబడించే గిరీశంవంటి వ్యక్తులు బాధిస్తుంటారు. మిగిలిన లుబ్ధావధానులు, అగ్నిహోత్రావధానులు, కరటకశాస్త్రిలు వంటిపాత్రలు 'కన్యాశుల్కానికి' గీటురాళ్ళవంటివి. ఇందులోని ప్రతిఒక్క పాత్ర ఆనాటి సమాజాన్ని ప్రతిబింబించే రీతిలో ఉంటుంది. అగ్నిహోత్రావధానులు శుద్ధశ్రోత్రియ బ్రాహ్మణ కుటుంబానికి చెందినవాడు సంప్రదాయంమీద, ఆచార వ్యవహారాలమీద మిక్కిలి నమ్మకం గలిగిన ఒక మూఢాచార పరాయణుడు. ఆయన తనకుగల ఒక్కగానొక్క కూతురు వైధవ్యాన్ని పొందినపుడు, ఆమెకు మనఃక్లేశం కలిగించు రీతిలో కేశఖండనం గావించి జీవితంమీద విరక్తిని కలిగిస్తాడు. ఆనాటివ్యవస్థలో బాల్యవివాహాలు విపరీతంగా జరుగుతుండేవి. ఆ వివాహాలను రద్దుపరచి, వితంతు వివాహాలను ప్రోత్సహించుటకే కందుకూరివారు నడుంకట్టారు 'కన్యాశుల్కం' అనేపేరు పెట్టడంలో ఉండే ఔచిత్యంకూడా పాఠకులు నాటకాన్ని చదివిన తరువాత అర్థం చేసుకోనగలరు. ఒకవిధంగా ఈ నాటకానికి 'గిరీశం' కథానాయకుడు అతడు వచ్చీరాని ఇంగ్లీషుతో అగ్నిహోత్రావధానుల కుమార్తెకు ట్యూషన్

మాష్టారుగా చేర్తాడు. మిగిలిన కరటక శాస్త్రి వంటి పాత్రలు 'ఆనాటి సమాజంలో మోసకారులకు దర్పణాలు కాగలవు. పందొమ్మిదవ శతాబ్ది తుదిభాగాన ఆవిర్భవించిన యీ నాటకంలో ఆనాటి సమసమాజం పూర్తిగా నగ్నంగా చిత్రింపబడింది. అయితే కథా, యితివృత్తం బలంగాఉన్ననూ పాత్రలరూపకల్పన చక్కగా ఉన్ననూ ఎందుచేతనో (యిది ఎక్కువమారులు) ప్రదర్శనయోగ్యతను పొందజాలక పోయింది. గురజాడవారు ఉన్నప్పుడే యిది తిరిగి ఒకమారు సంస్కరింపబడి మరలా వ్రాయబడింది. అయినా తగిన ప్రాశస్త్యానికి నోచుకోలేదు. ఇది ఒకదృశ్యకావ్యమైనా, శ్రవ్యకావ్య ధర్మాలను సంతరించుకోవడంచే దీనిని దృశ్యకావ్యమైన శ్రవ్యకావ్యంగా పేర్కొనవచ్చును.

ఆధునిక నాటకానికైతేనేమి, ప్రాచీన నాటకానికైతేనేమి ఉండవలసిన ప్రధాన ధర్మాలు నాలుగు. అవి 1) సంభాషణ, 2) సంఘటన 3) చేష్టితము 4) రసము ఈ నాలుగుగుణాలు ప్రధానంగా ఈ నాటకంలో ఎంతవరకు ఉన్నాయో గమనిస్తే, ఎందుచేత యీనాటకం ప్రదర్శనయోగ్యతను పొందలేకపోయిందో అర్థం చేసికొనవచ్చును. వస్తువులోనో, లేని కొన్న పాత్రలలోనో, తగిన సంభాషణలు వ్రాయడంలోనో గురజాడవారు తగినంత శ్రద్ధ తీసుకోలేదేమో ననేభావం వ్యక్తమాతుంది. తీసుకొన్న కథావస్తువు తెలుగు వాతావరణానికి దగ్గరగాఉన్నా, నాటకం నడపడంలో ఆంగ్లనాటక ధర్మాలు అధికంగా ఉన్నట్టుకన్పిస్తాయి. అందుకు కారణం గురజాడవారు ఆంగ్ల నాటక సాహిత్యాన్ని క్షుణ్ణంగా అధ్యయనం చేయడంకావచ్చు! భావవ్యక్తీకరణలో, పాత్రల నిర్మాణంలో, నాటక సృష్టిలో నీ ఆంగ్లసాహిత్య చ్ఛాయలు అధికంగా కనిపించవచ్చు! మొత్తానికి గురజాడవారికి తగినంతగా పేరు ప్రతిష్ఠలు తెచ్చిపెట్టి నప్పటికిని ప్రదర్శన యోగ్యతను పొందలేని నాటకం 'కన్యాశుల్కం'

మొత్తానికి కవిగా, కథకుడుగా, మహోన్నత నాటకకర్తగా గురజాడ వారు సాహిత్య లోకంలో శాశ్వతస్థానాన్ని సంపాదించిరన్న విషయం నిర్వివాదమైనది. భావనలో, ఆచరణలో, వ్యక్తీకరణలో సంపూర్ణనవ్యతను సాధించిన కవిపుంగవు డాయన. ఒకతరాన్ని తరాన్ని సైతం తమ రచనలచేత ప్రభావితం చేసి ఆధునికులందరికి మార్గదర్శకులయ్యారు.

ఈనాటి అగ్రగణ్యులైన కవులలో శ్రీశ్రీ, ఇంద్రగంటి హనుచ్ఛాస్త్రి, పాలగుమ్మి పద్మరాజు వంటివారు ఆయన విలువను సంపూర్ణంగా ఎఱిఁగి తెలుగుదేశానికి చాటిచెప్పారు. ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రిగారు 'గురజాడను వాల్మీకి'గా చిత్రించారు.

ప్రముఖసాహిత్యవేత్త, ఉత్తమవిమర్శకులునైన శ్రీ కె. వి. రమణారెడ్డిగారు గురజాడ జీవితంలోని సాహిత్యవిశేషాలను క్రోడీకరిస్తూ 'మహోదయం' అనే పేరుతో ఒక ఉద్గ్రంథాన్ని వెలయించారు. ఇంకా ప్రముఖులు ఎందరో గురజాడ సాహిత్య విశేషాలను విశ్లేషిస్తూ సాహిత్యవ్యాసాలు వ్రాశారు.

"గురజాడ అడుగుజాడ
అది భావికి బాట
మనలో వైధవాయిత్వం
మరపించే పాట"

అన్న శ్రీశ్రీ మాటలను పరిశీలించి చూస్తే, అవి వారిపట్ల యథార్థములేమో ననిపిస్తుంది. అందులకే

"నాదృష్టిలో గురజాడవారి సృష్టి"
కావాలి భావితరానికి ఒకపూలవృష్టి"

—*—

# పల్లెపడుచు

శ్రీ జి. యం. రామశర్మ

పచ్చనిచీర తేనడుము
పైనెగఁ జెక్కుయు సొంపునింపగన్.
పచ్చికసీమలో పదముఁ
బాడుచు పయ్యెద జారుచుండగన్
వచ్చెడు వర్ష ధారలకు
స్వాగత మిచ్చుమయూర మోయనన్.
మున్పటగొల్పు నాట్యమును
బూనెడు పల్లెపడంతిసౌ రహో.

కటిక నేలను గూడ కనకమ్ముఁ బండించు
కలికినా ముత్యాలకొలికి గాదె
చిన్నచిన్న పలుకుఁ జినుకులఁ జిలికించు
చిలుకనా బంగారు గొలక గాదె
కొండకోనలలోన కోటివన్నెలఁజిందు
కొమ్మ నాముద్దుల గుమ్మ గాదె
అజ్ఞానమనునట్టి యంధకారము మాపు
అవ్వనా యూరని దివ్వె గాదె.
తీయతీయుల తీవెలఁ దీర్చిదిద్ది
తీవె తీవెకు నవ్వులపూవు లమర
పూవు పూవున కమ్మనితావి నద్ది
కాన నేలెడు నందాలరాణి గాదె.

మండుటెండల తనువెల్ల మాడి మాడి
పడుచుదనము వెలయు మేని పసుపుఛాయ
కరిగిపైరుల పచ్చని కళలుఁదెచ్చె
కన్నులానంద రస తరంగములఁ దేల.
పండుపంటకు ప్రాణాలు పిండిపిండి
సిగ్గుబుగ్గల సొగసులు నుగ్గు నుగ్గు
బిసుపనులకు చేతులు పాడుపాడు
దిబ్బభూముల పాదాలు బొబ్బలెక్క.

ఓపికతోడ మేను చెమ
టోల్క శ్రమించుచు, చేనిలోపలన్
కాపును గాయు భర్తకును
కావడికుండల నిండనన్నమున్
దూపకు మోసిమోసి పతి
తో సరికష్టము పంచుకొంచు తా
ప్రాపుగ భారతీజనని
పాలిటి మెప్పుగుబిడ్డ యయ్యెడున్.

———

# శ్రీశ్రీ ప్రకృతి గీతములు - ఒక పరిశీలన

-శ్రీ డా. జి. బి. ఎస్ ఆచార్య, ఎం.ఏ.,పిహెచ్.డి.



సారస్వతారామమున నేడు ప్రభవించుచున్న కావ్యవల్లరులలో ఖండకావ్యము అగ్రతాంబూలమును స్వీకరించుచున్నది. ఒకప్పుడు పురాణములతోడను, మరొకప్పుడు ప్రబంధములతోడను అలంకరింపబడిన తెలుగుతల్లి నేడు ఖండకావ్యసంపుటములతో అలంకరింపబడుచున్నది. ఆధునిక కవులకు స్వేచ్ఛయే ప్రధానము.

శ్రీశ్రీ కడు పిన్నవయసుననే లలిత భావకవితావియద్వాహిని యైన "ప్రభవ" అను కావ్యమును ప్రభవింపచేసినాడు. ప్రభవయందలి ఆధునిక దివ్యఖండకావ్యములు త్రిభాగవిభాజితములు. అవి 1) ప్రకృతిగీతములు 2) ప్రణయగీతములు 3) ప్రకీర్ణగీతములు. ప్రస్తుతము 'ప్రకృతి గీతములు' పరిశీలనాంశము. ఇందు 'స్వేచ్ఛ, మేఘశకలము, ప్రకృతిగీత, మయూరనర్తనము, రజనీగానము, మాతృగీతి, సముద్రఘోషము, మృత్యుప్రబోధము అను ఎనిమిది ఖండికలు కలవు. ఈ ఎనిమిది ఖండికలను పరిశీలించినచో శ్రీశ్రీ ప్రకృతితత్త్వము ప్రస్ఫుటము కాగలదు. నవీనకవులందరకువలెనే శ్రీశ్రీకి గూడ 'ప్రకృతిలక్ష్మి' ఉపాస్యదేవత. ఆమెను పూజించును. ఆమె అంకమున ఆటలాడును. ఆమెనుగూర్చి పాటపాడును. మాటలాడును. ఆమెయందలి అన్వయము కాని వింత దృశ్యములనుగూర్చి బాలునివలె ప్రశ్నించును. ఆమె శరీర "సౌరభాకృష్ట మధుర సంస్పర్శసుఖము"న మైమరచి పోవును. ప్రకృతిలోని మధురగంభీర రహస్యములను తాను పసిగట్టి అక్షరరూపములో వానిని పాఠకుల ముందు సాక్షాత్కరింపజేసిన ప్రతిభకు ప్రభవలోని ప్రకృతి గీతములు ప్రతీకలు.

"స్వేచ్ఛ" అను ఖండిక గంభీర'ధ్వని' గర్భితము. గోరంత గీతములో కొండంత భావమును వెలిగింపగలిగిన నేర్పు ప్రశంసనీయము.

"ఆమహోన్నతదివ్య వృక్షాగ్రమందు
నూత్నచైతన్యరాగ సమున్నతములగుచుం
గదలియాడెడు పత్రసంఘములనడుమ
నేనుసైత మొక్కాకనై యొనయునెడల
అన్నిటీవిధాన జీవించియున్నకాల-
మాటపాటలతోం బూర్తియైన వెనుకం
గళలం గోల్పడి, కలుషపంకమునం జిక్కి,
క్రిందబడి పాంథజనుల త్రొక్కిళుల నుక్కి
ప్రకృతియాగారమున నశింపంగబోక-
గాలియొసంగెడు క్రొత్తరెక్కలు ధరించి,
అతినిరాఘాటముగ విహాయసపథాల
నెఱుకపడరాని యెచటికో ఎగసిపోదు!"

పైఖండికలో 'మహోన్నత దివ్యవృక్షాగ్రము' మానవలోకమునకు, 'పత్రసంఘములు' తోడి మానవులకు ప్రతీకలుగా చేయబడినవి. మానవజీవితరహస్యములను గొంతెత్తి పాడినకవి స్వేచ్ఛాభావము మెచ్చదగినది. కవులు ప్రకృతిశోభావిలాసలాలసులు, వస్తుసందర్శనము వలన నుత్పన్నమైన భావములను వారు లలితములు, అర్థవంతములు, ఆలోచనాసంధాయకములు అగు శబ్దముల సాహాయ్యమున వెలువరింతురు. సామాన్యున కుద్భవించిన భావములేకాక, సరిక్రొత్త భావములు కవి హృదయమునందు పొడసూపును. కనుకనే శ్రీశ్రీ "మేఘశకలము" అను ఖండికను వినూతన విశిష్టదృక్పథముతో రచించినాడు.

"ఈ ప్రకృతిగాఢరహస్య మెఱుంగలేక
చంచలమనస్కతం బరిభ్రమించు నాకు
విశ్వపథముల నడయాడి వేసరిలుట
యన్నివిధముల భావ్యమే యగును గాని-
ఓ వలాహకశకలమా! నీవుకూడ
నావలెం బరిభ్రమించుచున్నావ దేల?"

అని ప్రశ్నించుటలోని "జిజ్ఞాస" పాఠకులను విజ్ఞానపథముల వెంట పరుగులెత్తించినది. మేఘములో "తతసమస్తప్రభావనిధానవితతి" కలదని సంభావించినారు. సింహనాద మొనర్చుచు, స్థిరనిరంతవారిధారల గురియించు వైభవము, మేఘము యొక్క మహిత ప్రభావసమన్విత మని వివరించినారు

"ఒకసమయమందు లీలాభియుక్తి మెఱసి
సాంధ్యరాగ ప్రభాంకురచ్ఛాయలందు
వివిధవర్ణసముజ్జ్వల విభవమంది,
విమలసంతోషభావ సంవృత్తి నెసంగి,
వినుతగతులవిహాయస వీథులందు
దాండవించెడు సమధికోత్సాహశక్తి
నీవిధానము కాదె! నీనియతి కాదె!
నీవిటుపరిభ్రమించుచున్నావిం కేల?"

అని మేఘముయొక్క స్వభావమును రమణీయముగ వర్ణించి, రసజ్ఞులను రసలోకముల విహరింప జేసినారు. ప్రకృతి సౌందర్యమును తిలకించి, పులకించి తాదాత్మ్యమును పొందుట "ప్రకృతిగీత" అను ఖండికలో కనిపించును.

"మాధురీమోహనం బిది! మసృణకుసుమ
వాసనావాసితం బిది వైభవప్ర
భావబంధురబహుతర ప్రభలకెల్ల
ఆటపట్టిది! ఇచటనే నాడుకొందు!"

అనియు

"ఇదిమనోజ్ఞప్రకృతిధామ మిచటం జేరి,
అమృతపేశలనవమాధురిమముం గూర్చు
విహగకలకూజితధ్వనీవిధములందు
స్వీయకంఠారవము మేళవించుకొందు'

అనియు అత్యంత ప్రమోదమును వెల్లడించినారు. ఈ ప్రకృతి నవోజ్జ్వలము. అమృతరసైకమధురము, మనోహరానందసదనము, అని కవిభావము. అందులకే

"ఈ ప్రకృతిగర్భకుహర కాంతిప్రసార
వీచికామార్దవమునకు వివశమతిని"

అనుటయేకాక కృపామాధురీ వృష్టిం జిందెడు దేవియైన ప్రకృతిమూర్తికి సాష

ప్రాతిరేకముగా సాష్టాంగ ప్రణుతులను సమర్పించినాడు. లలితము, సత్యసమ్మతము, భావోద్దీపకము అయిన ఈఖండిక శ్రీశ్రీ కవితాకాశములో మహోన్నతముగ నర్తించు పతాక.

"మయూరనర్తనము" అను ఖండికలో శ్రీశ్రీ కవితాశక్తి శివతాండవ మొనరించినది. ఒక కావ్యమునందు కవి బ్రతికియుండుటను సూచించునది శబ్దసందోహము, అని అభిజ్ఞుల అభిభాషణము. 'ఒక విషయమును వర్ణించునపుడు ఆవిషయము నందున్న మృదుత్వమును, సౌందర్యమును, ఇతర బాహిరిక స్వరూపమును, శబ్దగతార్థమును బట్టియేకాక ప్రయోగింపబడు శబ్దములను బట్టి; అనగా నిర్ణయింపబడి ఒక దానివెంట ఒకటిగా కూర్పబడిన మాటల గమనమునుబట్టి, స్ఫురింపజేయుట ఒక రచనా వైదగ్ధ్యమునకు చిహ్నము.' అని విమర్శకుల అభిప్రాయము. శ్రీశ్రీ కవితలలోని శబ్దవిన్యాసవైచిత్రిని పరికించినచో పైని చెప్పబడిన రచనావైదగ్ధ్యము గోచరింపగలదు.

"అమలశిఖామయూఖముల
నంతవిధోజ్జ్వల సాంధ్యరాగర
క్తిమమును గేలిసేయు నతి
దివ్యసుఖోత్సవదాయి నీల స
త్ప్రమదవనాంతరస్థల వి
రాజితరమ్యసరస్తటంబులన్
సమదవిలాసశైఖరుల
సంపదలీనుచు దాండవింపుమా!

ప్రకృతి పరిశీలనా వైశద్యముగల ఈ పద్యము శ్రీశ్రీ శబ్దాలంకార ప్రయుక్తతకు తార్కాణము.

"జలదములఁ గాంచి సంతోషజల్ధిఁ దేలి,
యతిమనోహరగతినాట్య మాడునప్పుడు
నీనవోన్మేషగోచిర్వితాన మలరఁ
బ్రమదవనమున సూర్యోదయమువిధాన'

అనుటలో శ్రీశ్రీ భావోన్నత్యము తేటతెల్లమగుచున్నది. భావనాప్రపంచమునకు కవి సృష్టికర్త యనుటకు పైయుదాహరణము చాలును.

ప్రకృతిని గాంచి తనను తాను మరచిపోయి, భావోన్మాదమున గాన మొనరించుచు ప్రకృతిలో తానపుడు లీనమగుటకు మిగులయుత్కంఠను వెలువరించుట భావకవుల లక్షణము. ఈ లక్షణము శ్రీశ్రీ లోనున్న దనుటకు "రజనీగానము" అనుఖండిక విలక్షణోదాహరణము.

'వివిధసూనవితానశోభితకుజ ప్ర
శస్త సుప్రమదావనస్థలము సాంద్ర
చంద్రికాసముజ్జ్వలద్దివ్యశర్వరీప్ర
శాంత వేళ సమంచిత సౌఖ్య మొసఁగ!
మైమరచిపోతి నంతసమస్తభువన
సముదయ మెలర్చె నపుడె విస్తారమధుర
గాననిస్వనకల్లోల కలితలలిత
భావకవితావిమద్వాహినీ విధాన!
ఆ వినూతనోత్సాహదాయక మనోజ్ఞ
సమయసంజనితాధిక సంభ్రమమున
ప్రకృతిసౌభాగ్యవిభవవైచిత్రిఁ గాంచి
పరవశతనొంది గొంతెత్తి పాడుకొంటి!'

– [illegible]చిత్రము లందలి సౌ[illegible]ము సహృదయహృద్యము. పరాత్పరుని సృష్టిసౌందర్యమున కాలవాలమైన ప్రకృతిలో సౌఖ్యప్రదములైన దృశ్యములనే కవి చూచినాడు.

శ్రీశ్రీ 'రసపిపాసాతుర హృదంతరాళమునకు, ప్రకృతియోషామృదూక్తు లమృతనిభముగ, హర్షదాయకములు;' అని 'మాతృగీతి' అను ఖండికలో బోధించుచున్నాడు.

'ఉకుమహీధరసానునిర్ఝర నికాయ
నిర్మలాంబుప్రవాహానిర్ణిద్రవృత్తి
విలసనమ్ములఁ బ్రకృతిదేవీప్రహృష్ట
హృత్ప్రపూర్ణానురాగ వాహినిగఁదోచె!'

అని యుత్ప్రేక్షింపగలిగిన శ్రీశ్రీ ఉత్తమకవితాసాధియగుటలో నాశ్చర్యము లేదు.

ప్రకృతిని వర్ణించు సందర్భములందమానవప్రపంచమునకు చెందిన విషయముల నందుఁ జొప్పించి, వింతరీతి ప్రకృతిచిత్రమును పాఠకుని కనులయెదుట ప్రదర్శించు కళాప్రతిభ 'సముద్రఘోషము' అనుఖండికలో వెల్లడి యగుచున్నది.

'నేనొక విశాలరాజ్యలక్ష్మీనృపాల
పద మధిష్ఠింతు! నారాజ్యపాలనమున
నిరతముద యించునిర్ఘోషనిచయమందు
మామకాజ్ఞాప్రణాళిక ల్మలయుచుండు!
నే ననుగ్రహా నిగ్రహాజ్ఞానమతిని!
నాకనారతమానందశోకగతులు
కలుగుచుండును నాకింత తెలియరాక!
నాచరిత్రము నాకె యనన్యము కాదు.

అనుటయే గాక తనను నడిపించు 'శక్తి' మరొకటి కల దని అంగీకరించి, సత్యాన్వేషణ చేయుట గమనింపదగియున్నది.

సృష్టిలయములు ప్రకృతి మర్యాద, ఈ భూమిమీద సృజింపబడిన మానవుడు మృత్యుదేవత స్వరూపమును తెలిసికొనుట అసాధ్యము. అయినను కవి తన భావనా బలము నుపయోగించి మృత్యుదేవత స్వరూపమును కనులకు కట్టించు నేర్పు గలవా డనుటకు శ్రీశ్రీ 'మృత్యుప్రబోధము' అను ఖండిక నిదర్శనము. 'లోకభీకర మహోగ్ర ఫణివిషస్ఫీత మృత్యురూపిణి' అయిన (మృత్యు) దేవతను ప్రతారింప గలశక్తి మానవునకు లే దనియు, ఆమె కరాళజిహ్వాకలయందు జీవసముదయ మెప్పుడైనను చిక్కవలసినదే యనియు ప్రకృతిసత్యము ప్రబోధింపబడినది.

దివ్యతేజస్సముజ్జ్వలత్రిభువనాంత
రాళతలమె మదీయ నాట్యాలయమ్ము !
నాప్రళయతాండవమున జీవప్రకాండ
హృదయతంత్రులె నినదించు నుదితగీతి !
నాకనులఁ బొల్చు సుప్రసన్నప్రశాంత
హాసకాంతులె కురియించు నగ్నివృష్టి !
నాగళమునందు మేఘగర్జాగభీర
భయదనిర్ఘోషములు వినంబడుచునుండు !
నాగతులయందు చరమసంధ్యాప్రదీప్త
శోణవర్ణాభరక్తరోచులు స్ఫురించు !'

అని మృత్యుదేవతయొక్క ప్రభావ ప్రతాప విన్యాసగరిమను, ఆమె సర్వలోకైకచండశాసనచణత్వమును అత్యద్భుతశక్తితో నూహించి 'ఇకనైన తెలివిగనుము' అని మానవుని హెచ్చరించినాడు.

హృదయమున్న ప్రతిమానవునియందు భావము లుత్పన్నములగును. ఆయుత్పన్నమైనభావములవైఖరి హృదయ సంస్కారముపై ఆధారపడియుండును. కనుక శ్రీశ్రీ ప్రకృతిగీతములలోని మహోన్నత భావములు ఆయన మహోత్తమహృదయ సంస్కారమును వెల్లడించుచున్నవి.

— · · —

# సాహిత్య తపస్వి

— విద్వాన్ శ్రీ బులుసు వేంకటేశ్వరులు, ఎం.ఏ.



ఏదేశమైనను ఆదేశ సాహిత్యోత్కృష్టతను బట్టి ఆదేశమునకు గౌరవము కలుగును. ఆగౌరవము దినదినము పెరుగును. సాహిత్య మంతటిది. సాహిత్యస్రష్టలు కవులు. సుకవీశానులపై సువిశాలదేశ గౌరవ మాధారపడియున్నది. రాజకీయ సాంఘికార్థికాభివృద్ధులు వల దని కాగు. అవి క్షణభంగురములు. సర్వదా మారు స్వభావము కలవి. నేటి రాజు నిన్నటి పేద. నేటిపేద రేపటిరాజు. దిగ్దిగంత కీర్తివిశ్రాంతులు మహాత్ము లేలినదేశములు కార్మిక కర్షక సామాన్యు లేలుచున్నారు. రే పెవ రేలుదురో తెలియదు. సాహిత్య మట్టిది కాదు. శాశ్వతము లగు పునాదులపై నిర్మించిన సాహిత్యసౌధములు చెక్కుచెదరక నిలిచియే యున్నవి. సాహిత్యకల్పవృక్షచ్ఛాయలో రాజకీయ గ్రీష్మవాతూల హతులైనవారు విశ్రాంతి గొనుచు వ్యర్థజీవితము సార్థకమైన దని సంతసించుచున్నారు. ఎప్పటికైనను హితాహితజ్ఞానముచే ప్రశాంతి నొసగునది సాహిత్యమే. సాహిత్యస్రష్టలు లోకవృత్తనిదాఘవిదాహితులైనవారికి సుధామయశాశ్వత మృణ్మయ పాత్రలు నిర్మించు కులాలురు, ఉపకారులును.

కవి ఋషి. కవులు క్రాంతదర్శులు. భూత భవిష్యద్వర్తమాన త్రికాలవేదులు ఆత్రికాలవేదితకు తపస్సు ముఖ్యము. సామాన్యపుపనులే యెంతగానో తపించిన గాని సఫలములగుట లేదే! మహాకావ్యములకు మహాతప మవసరము కాదా! రామాయణ మహాభారతాదుల నిత్యనూతనత్వమునకు శాశ్వతత్వమునకు మూలకారణమవి మహాతపస్వుల తపఃఫలము లగుటే. రామాయణము వాల్మీకి తపఃఫలము. భారతాదులు వ్యాసుని తపఃఫలము. అనంతాఖండతపస్సులకు గాని శాశ్వత కావ్యసృష్టికర్తృత్వము సాధ్యము కాదు.

తపశ్శాలులు మాత్రమే మహాకవులైన భాగ్యము మనదేశమునకే పట్టినది. అది యితరదేశములకు లేదు. కారణము : ఆయాదేశసంస్కృతు లట్టివి. సంప్రదాయము లట్టివి. 'నానృషిః కురుతే కావ్య' మ్మని మనదేశముననే చెల్లినది. 'తపస్స్వాధ్యాయనిరతుఁడు, తపస్వి, వాగ్విదులలో వరిష్ఠుఁడు' వాల్మీకి మహాముని తా నివియు యీమహాలక్షణములను నారదుని కాతఁడు ప్రవంచించినాఁడు. మహాతపస్సాధ్యము లగు మహాకార్యములు అల్పపుణ్యు లారంభించి కృతార్థులు కాలేక వెఱ్ఱిశలలు వేసి బుద్ధి వక్రింప నియమనిష్ఠలు లోపింప నీతివిడిచి నిరంబరులయి నింద్యులగుచున్నారు. అట్టివారు వ్యర్థులు, ఆత్మనాశకులు.

చిత్ర మేమనగా- వైద్యపట్టములు లేనివారు వైద్య మొనరించిన దండనార్హు లగుచున్నారు. న్యాయవాదిపట్టము లేనివారు న్యాయవాదులుగా న్యాయస్థానమున ప్రవేశార్హత గనరు. ఉపాధ్యాయులు కాఁగోరువారు రాహాయర్హతలను సంపాదించిన గాని ఆయుద్యోగములలో ప్రవేశింపలేరు. మఱి కవులన్ననో : ఏ అర్హతయు లేనివారు తామే మహాకవుల మనుకొనువారు, అనిపించుకొనువారు చెదపురుగులుగా పుట్టగొడుగులుగా బయలుదేఱుచున్నారు. నీతినియమములను ఉల్లంఘించుచున్నారు. సంప్రదాయములను వ్యతిరేకించుచున్నారు. మన సంస్కృతి శవసంస్కృతి యని పర

సంస్కృతి భవ్యసంస్కృతి యని యేమేమో వాగుచున్నారు. అట్టివారివలన వారికిగాని సారస్వతమునకుగాని దేశమునకుగాని యేమేలు లేకపోవుటే కాదు. అవాంఛనీయపరిస్థితులకు భాషాభావములయనారోగ్యమునకు, నాశనమునకు వారు కారకులగుచున్నారు

సంప్రదాయము విడుచుట నేల విడచినసాము అని మహామేధావు లంగీకరించినారు. నవ్యత యెంత యవసరమో భవ్యప్రాచీనత అంతయవసరము. విప్లవదృష్టి యెంత యవసరమో సౌమ్యపరిణామదృష్టి యంతయవసరము సుకవితాసామ్రాజ్య నిర్వహణధౌరంధర్యము సామాన్యసాధ్యము కాదు. సృష్టికి ప్రతిసృష్టి చేసిన విశ్వామిత్రు డతపస్వియా అల్పతపస్వియా ? సృష్టికర్త యాశక్తి సంపాదించుట మహాతపస్సుననే కదా! సాహిత్యసృష్టికర్తకు అసామాన్యశమదమాదిషట్కసంపత్తి, 'పూర్వకవివాక్సిద్ధియోగదక్షత', ఆత్మానాత్మవివేకము, ఇహాముత్రఫలభోగ విరాగము, మున్నగు మహాలక్షణములు జన్మతఃఉండి తీరవలయును. ఇవి యోగలక్షణములు. జ్ఞానలక్షణములు, కృషివలన, దీక్షవలననివి సంపాదింపనగును. సంపాదించుకొననగును. అట్టికవి రవి గాంచనివానినైన దాను గనగలడు. సాహిత్యతపస్వి నిజతపోరూపకావ్యసృష్టివలన జాతికి మహోపకృతి చేసినవాడగుట సత్యము. క్షణిక లోకవిషయములనుగాక ఆత్మావలోకన మహాసామ్రాజ్యము నంక కాతడు సామాన్యులనుగొనిపోయి వారికి చిత్తశాంతి నీయగలడు. చిత్తశాంతి కంటె సంపాదింపవలసిన పరమార్థమేమున్నది ? కవి యన జ్ఞాని యనియు నర్థము. కవి యన భవరోగనిర్మూలన మహావైద్యుడు. అట్టిసత్కవులం లోపించుట జాతికి మిక్కిలి లోపము.

సాహిత్యతపస్వియే సత్కవీశ్వరుడు.

'సత్కవీశ్వరుండు సార్వభౌమునికన్న
మిన్న మణికిరీటమున్న లేక
యున్న నెన్నటికినిసన్నుతుండతండౌను'

'ధనముకోస మతఁడు తాపత్రయపడండు
కీర్తి నతడు గాంచు నార్తిగాక
సుకవిచంద్రుధన్యతకు నెల్లలున్నవే?'

అతడు శతధా స్తుత్యుడు. అన్ని కాలముల అన్ని వేళల ఆరాధ్యుడు.

'కుందపుష్పవితతిసౌకుమార్యమ్మును స్వచ్ఛ
తయును సౌరభంబు తనరుకవిత
కవిత కాని అన్యకవితలు కవి[illegible]

'అమృతతుల్యమగుచు ఆపాతమధురమై
భద్రప్రవాహదివ్యభావదీప్తి
అలరజేయుచుండునదియే కవిత్వంబు'

వేయేల, సాహిత్యతపస్వి సత్కవిత్వము :

'చదువ చదువ చదువ చవులూరజేయుచు
చదువువారికి వినగదియు వారి
కమృతపదము' నొసగును.

---

**Statement about ownership and other particulars about**
**'Samalochana' National & Cultural fortnightly, Rajahmundry**

Form IV
( See Rule 8 )

1. Place of publication : Rajahmundry
2. Periodicity of publication : Every 1 st and 16 th
3 Printer's Name : Sri B. Sitharama Sastry
   (Whether citizen of India ?) : Indian
   (if foreigner state the country of origin)
   Address : 6-8-7 Innespeta Rajahmundry -1
4. Publisher : Sri B. Sitharama Sastry
   Whether citizen of India ?) : Indian
   (if foreigner state the country of origin)
   Address : 6-8-7 Innespeta : Rajahmundy-1
5. Editors' Name : Sri B. Sitharama Sastry
   Whether citizen of India ?) : Indian
   (If foreigner state the country of origin)
   Address 6-8-7 Innespeta, : Rajahmundry-1
6 Name and address of individuals who own the news paper and partners or shareholders holding more than one percent of the total capital. : Sri B. Sitharama Sastry 6-8-7, Innespeta Rajahmundry-1

I B Sitharama Sastry, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

Date 1-3-1979 (Sd) B. Sitharama Sastry
Publiher.

## స్వార్థకేళి

శ్రీ కె. మోహనరావు, ఎం. ఏ.

మనీరావణుల అశోకంలో
మహీతనూజల పరితాపం
అధికార సహస్రాక్షుల రాసలీల
ఆర్ద్రఅహల్యల పాలి అభిశాపము
నిప్పులు చెరిగే గ్రీష్మతాపం
నిట్టూర్చే పరిశ్రాంతుని ఆక్రోశం
శ్రమపరు నుదుట స్వేదజలం
తరతరాల చెదరని విశ్వాసం
నగరకంకాళాల్ని సవరించి
బిగికండరాల్ని కరిగించి
రుధిరాశ్రువులతో అభిషేకించి
జీవనరూపందిద్దిన 'విరించి'
నలువైపులా ముసిరిన
నైరాశ్యపునీడలలో, కలగిపోతున్నప్పుడు
నేల నాలుగు చెరగులా
సమస్యల యమపాశాల, సతమతమవుతు
న్నప్పుడు_ఆ
శ్రమజీవుల ఆశల సమాధుల్నే
పునాదులుగా మార్చుకుంటున్న స్వార్థం
నవనాగరికతా వేదికలు ఎక్కి
నవతా, సమతా ధర్మాలను వల్లిస్తూ
భీకరదారిద్ర్యకరాళ దంష్ట్రల చిక్కి
నలుగుతున్న మానవత్వాన్ని
నలుగురిలో నవ్వులపాలు చేస్తున్నది.

---

( 17 వ పేజీ తరువాయి )

'కవి వతంసుడన్న జ్ఞానియనంగను
సిద్ధపురుషుడన్న శివుడనంగ
పరమపురుషుడన్న భగవంతుడే యగు,
'కవివరేణ్యుడన అకారణబంధువు
అజ్ఞతాతిమిరము నడచుజ్ఞాన
రవి జితేంద్రియుండు రమణీయ తేజస్వి'
'కవి భిషగ్వరుండు భవరోగనిచయంబు
క్షణములోన మాపఁజాలుఘనుడు
సరసకవుల కివియె సాష్టాంగవినతులు'
సాహిత్యతపస్వుల కివియే జోహారులు.

......




## సాహితీసుధాలహరి

(రచయిత: శ్రీ యస్. నాగయ్యగారు, ఎం ఏ. ప్రిన్సిపాల్, గోవిందరాజస్వామి కళాశాల, తిరుపతి. వెల 5 రు.)

వాఙ్మయ మను క్షీరసముద్రమును విమర్శనామందరముతో సహృదయపురోభాగు లను దేవదానవులు చిలుకగా నేర్పడిన సుధామాధుర్యమును వెలికిదీసి నిగూఢమగు నద్దానిని బహుజనభోగ్యముగా నొనర్చుటకు పలువురు ధీవిశిష్టులు యత్నించిరి. అట్లు యత్నించినవారిలో శ్రీ సముద్రాల నాగయ్యగారొకరు. వీరు తాము సాధించిన సాహితీసుధను లహరీరూపమున వెలయించిరి. అదియే సాహితీసుధాలహరి.

ఇందు క్రమముగా నన్నయ, తిక్కన, శ్రీనాథుడు, అల్లసాని పెద్దన, నంది తిమ్మన, రామరాజభూషణుడు, సంస్కృతభాషాప్రాశస్త్యము, అను విభాగములుకలవు. పైవిషయములను యథాశక్తిగ శ్రీనాగయ్యగారు విమర్శించిరి. వీరు గ్రహించిన విషయములు సముద్రములంతటివి.ఇంచుమించుగా నొక్కొక్కటియు కొన్ని పరిశోధనవ్యాసములను (P.H.D.) చేయగలిగినంత పరిమాణవిశిష్టములు. ఇట్టివిషయములను క్షోదక్షమములంగవలసింతదిఙ్మాత్రముగ విమర్శించి శ్రీ నాగయ్యగారు తమయింటిపేరును సార్థక మొనర్చికొనిరనిపించును.

ఆదికవియగు నన్నయ్య రచనాదికమును చాలచక్కగ సూత్రప్రాయముగ విమర్శించిరి. 'భూయాసుఃపురుషోత్తమాంబుజభవ శ్రీకంధరాః శ్రేయసే' యను వాక్యమువలనన, 'శారదరాత్రులు . పరపూరితంబులై చారుతరంబు లయ్యె' అను నన్నయ చివరిపద్యభాగమువలనను కవిత్రయముచే నీభారతరచన సంపూర్తి నందగల దని విమర్శకుల యూహ యని వివరించిరి. సంస్కృత శ్లోకభాగము, 'పరపూరితంబులై' అను భాగము, దానికి ప్రోద్బలకములుం కావచ్చును. కాని 'చారుతరంబులై' యనునది కాదు కదా! అట్లే శకుంతల దుష్యంతునకు తన తలిదండ్రులప్రణయవృత్తాంతమును జెప్పుటను నిర్లజ్జగా నిస్సంకోచముగా జెప్పుటను ఆశ్రమవాసినియగుటచే తాత్త్వికచింతన గలిగియుండుటచే సంతానప్రయోజనము నెరిగినదియగుటచే యిత్యాది విశేషణముల సమర్థింపజూచిరి. శకుంతల 'అనంతవిలాసంబున జయంతుండపోని యతని దుష్యంతుగా నెఱింగి యతిసంభ్రమంబున, జనవల్లభ! మీరు వచ్చుటెఱింగిన వారును (కణ్వుడు) వత్తురని పలికెను. దుష్యంతుడు శకుంతల కణ్వున కెట్లుకుమార్తె యయ్యెనో యెఱుగగోరెను. ఈ సందర్భమున శకుంతలకు 'లతాంగి, కోమలి మహోజరాజ్యలక్ష్మి, నళిననేత్ర మున్నగు విశేషణముల నుపయోగించెను. శకుంతల తన కథను చెప్పుచు విశ్వామిత్రు నాశ్రమము ప్రవేశించినతరువాత తన తల్లి యగు మేనకను, లలన, అనిమిషకాంత, అంబుజలోచన, బాల, తరుణి, మున్నగువిశేషణముల నిర్దేశించుటవలన శకుంతలకు దుష్యంతునిపై ననురాగ మేర్పడినట్లు గ్రహింపవచ్చును. మదనాతురుండయిన దుష్యంతుడు తన యుం దకోమలి యను రాగంబు వీక్షించి వివాహమాడగోరెను. శకుంతలయు తమవివాహము ధర్మ్యమగుటకై తనపుత్రునికి రాజ్యప్రాప్తిని గోరెను. దుష్యంతునియందు తనకు గల

యనురాగము నెరిగించుటకై అలసతో నొప్పగా ఇత్యాదిపద్యమును చెప్పెను. అనగా శకుంతల మేనకావిశ్వామిత్రుల శృంగారవర్ణనను మాటిడినిగళిత వేద్యాంతరయై (శకుంతల) దుష్యంతునిపైగల యనురాగము నెరిగించెను. జగత్పితరులగు పార్వతీపరమేశ్వరుల శృంగారవర్ణనయను ననౌచిత్యమును కాళిదాసునకు పరిహరించుటకై యాలంకారిక ప్రముఖులు పడవలసినంత శ్రమ లేకుండ నన్నయ పై ఘట్టమున చూపినచాతుర్యమునకు మనము ప్రశంసించుటదక్కి దానిని సమర్థించుటకై శకుంతలయాశ్రమవాసిని, తాత్త్వికచింతనామతి యిత్యాది విశేషణముల సరిచూడ యత్నించుచున్నాము. ఆదికవియగు నన్నయ కనీసము మనపాటియైన కాళిదాసును పరిశీలింపకయుండునా? తత్రాపి శకుంతలోపాఖ్యాననిర్వాహణమున ప్రమాదోధీమ తామపి.

తిక్కన కవితాతత్త్వమును చాల చక్కగ వివరించిరి. అనువాదపద్ధతిని చాలవిస్పష్టముగ నిర్దేశించిరి. 37వ పేజీలో సుదేష్ణ సైరంధ్రిని కీచకునింటికి బంపు ఘట్టములోని సుదేష్ణమాటయగు శ్లోకమున 'ఉత్తిష్ఠ గచ్ఛ సైరంధ్రి కీచకస్య నివేశనం, పాన మానయ కల్యాణి పిపాసా మాం ప్రబాధతే' వైరస్య మున్నదనియు ననువాద మగుపద్యమున (కీచకునియింట నెప్పుడు వాచవియగు బహువిధంపువారుణి గలుగున్ వేచని యిచటికి గొనిర మ్మామాత్రము గాని నీ గమనవేగంబున్) నాజూకుతన మున్నదనిరి. శ్లోకములోని క్రీగీటులవలన నావైరస్యము పరిహరింపవచ్చును. మరియు వ్యాసుని భారతరచన, తిక్కన రచనావిధానము, లక్ష్యములు భిన్నములు. కావున దీనికైమరొక భాగములో నిచ్చిన పాఠకుల కాభేదము స్పష్టమగును. వీరిచ్చినభాగములో దృశ్యాదృశ్యముగ నున్నట్లున్నది. తిక్కన చూపిన మెలకువలను చక్కగా నిర్దేశించిరి.

శ్రీనాథునివంటి శివభక్తునివిషయమున గల రసికత, మున్నగు నపవాదముల ఖండింపకపోవుటచే నాతనిశృంగారిగా వనితాసక్తునిగా భావించిన ట్లగపడును. కాని బహురాజాదరణ నంది బహుదేశములద్రిమ్మరి బహువిధసమ్మానములనంది విద్యాధికారిపదవినందిన శ్రీనాథుని కవితా శ్రీనాథుని చరిత్రహీనునిగా భావించుట సమంజసము కాదు. కవివ్రాసినదంతయు స్వీయానుభవము కావలయునని నియమము లేదుకదా!

అల్లసానివానియల్లిక జిగిబిగిని విపులముగా విమర్శించిరి. వరూథినీప్రవరుల శృంగారమును విపులీకరించిరి. అన్ని పాత్రలను వివరించిరి. ప్రబంధనిర్వచనముగావించి పెద్దనచేసిన రసవంతములగు మార్పులనుజూపిరి. కాళహస్తిమాహాత్మ్యము పాండురంగమాహాత్మ్యము మున్నగువానిలో వస్త్వైక్యము లేదనిరి. క్షేత్రప్రశస్తివివరణరూపవస్తువు ప్రాధాన్యము నంగీకరించిన వస్త్వైక్యము వానియందును కలదుగదా! మనుచరిత్రలో వరూథినీప్రవరుల శృంగారముపహించిన ప్రాధాన్యము తదితరఘట్టములకు లేదను వాదము అంగీకరించినట్లైనది. అట్లు చూచిన మిగిలిన ఘట్టములు వరూథినీప్రవరుల శృంగారఘట్టముకంటె రసహీనము లగును. అది కావ్యమునకు కుత్కృష్ట యగునా?

నంది తిమ్మన సౌకుమార్యమును చక్కగా కన్నులకు గట్టినట్లుగా వివరించి పారిజాతాపహరణ నాటకీయతను మనోహరముగా నిర్వహించిరి. ఆతఁడు చేసిన మార్పులను రసవంతము లని చక్కగా నిరూపించిరి. రామరాజభూషణుని సర్వతోముఖవైశారద్యమును వసుచరిత్రవైశిష్ట్యమును బాగుగ విమర్శించిరి. సంస్కృతభాషా ప్రాశస్త్యములో సంస్కృతభాష, వాల్మీకి కాళిదాసు, భారవి, మాఘుడు, బాహుడు, శ్రీహర్షుడు జగన్నాథుడు, వీరినిగూర్చి సంగ్రహప్రాయముగ విమర్శించిరి. వీనిని మరింత వివరించవలసియున్నది. 'కావ్యేషు మాఘః కవి కాళిదాసః' ఈ శ్లోకభాగము సరియైనది కాదు. మాఘశబ్దము కావ్యవాచకమైనచో నపుంసకమున నుండుట

ధర్మముకదా. కవివాచకమైనచో 'విశ్వ తే' వంటి పదము నధ్యాహారముచేసి కొనవలయును. దానితరువాతిదైన 'కవి కాళిదాసః'యేమి? మొదటి భాగములోని నిర్వహణకు రెండవభాగమునకు ప్రక్రమ భంగము కానవచ్చుచున్నది. శ్లోకమును పూర్తిగనిచ్చిన బాగుండెడిది. ప్రసిద్ధులగు భాసాగులను స్పృశింపలేదు. తెనుగు కవులలో ఎఱ్ఱన నాచనసోమన కృష్ణ రాయలవంటివా రు పేక్షితులైరి. కృష్ణ రాయలయుగము తరువాతికవులను విడచుట యేలనో? తరువాతిదైన ఆంధ్ర సాహితిని తిరుపతివేంకటకవులు, వేదము వారివంటివారిని స్పృశించినబాగుండెడిది.

ఇందు సుసాధ్యము (5వ పేజి) 59పునీతము 151 ఉపోద్ఘాతము 172 బాహిరము 181 రతీదేవివంటి పదములు ప్రయుక్తములు. ఉపోద్ఘాత (200) ఉషఃకన్య వంటిప్రయోగములుండుటచేత ఉపోద్ఘాతము ప్రామాదికము కావచ్చును.

మొత్తముమీద శ్రీ నాగయ్యగారు సాహితీసుధాలహరిని చాల చక్కగ ప్రశంసనీయమైన మార్గములో నాదర్శప్రాయముగ నిర్వహించిరి. వీరివిమర్శనా పద్ధతి పాండిత్యము వాక్యరచనాదికము సర్వదా సర్వథాప్రశంసనీయములు. దిగ్దంతులైన శ్రీయుతులు జి. ఎన్. రెడ్డిగారు, రాళ్ళపల్లివారు, గంటి జోగిసోమయాజి గారు, దివాకర్లవారు, పుట్టపర్తివారు దీనిని ప్రశంసించుట, ఎం. ఏ. పరీక్షకు పాఠ్యగ్రంథంచేయుట ద్వితీయముద్రణ నందుట, దీనివిలువను గుర్తించి గౌరవించదగినగా గ్రహింపవలసిన విషయాలు. శ్రీ సముద్రాల నాగయ్యగారు కళాశాల ప్రిన్సిపాలువంటి విరామం లేని యుద్యోగములోనుండి యింతచక్కనిరచన నిర్వహించడంవలన,విరామంపొందినచక్కగా మరిన్ని విమర్శలు రచించి ప్రచురించి తెనుగువారి కితోధికమైనసంతోషాన్ని కలిగించగలరని మనమూహింపవచ్చును.



# భగ్నవీణ

"అష్టావధాని"

శ్రీఅవధానం రంగనాథవాచస్పతి



బాలుండవంచు, సన్నుతయ
   పాలుండవంచు, ప్రియోక్తిమాధురీ
శీలుండవంచు, మన్మధుర
   చిత్తవశీకరణేక్షణప్రభా
జాలుండవంచుసత్త్వగుణ
   సంయుతరాగరసైకభావనా
లోలుండవంచు నెంచి మది
   లోనిను నిల్పితి మోసపోయితిన్.

ఏనుధుమాసముగ్ధమధు
   రేహలఁ దేలుపికంబుజంట లే
మామిడికొమ్మలందొదిగి
   మంద్రముగా రవళించువేళ నా
రామమునుండిద్రోలి
   యనురాగముబాపుటకున్, ఫలమ్ముగా
నామనిలేని శైశిరమ
   హాంధతమస్విని నన్నుముంచెడిన్.

స్వైరిణియంచునల్పురవ
   హేళనసేయఁగ నాటపాటలన్
దీరనిమోహముల్ పెనచి
   తీయనినావలపెల్ల నీకునై
వారతిబట్టునాడెలుగ
   నంతయుబూడిదఁబోయు నాజ్యమై
యీరసహీనమా బ్రతుకు
   నీడ్చుటనాతలవ్రాసియుండుటన్.

పాడినపాటలెల్ల యెరు
   పారినకన్నుల బాష్పధారలై
యాడినయాటలెల్ల నెపు
   డారనిగుండియలోన బాకులై
పీడని నీస్మృతుల్ పరమ
   వేదనని ంపెడు, నీగస్వార్థపుం
గ్రీడకుఁబావునైతినిటు
   కీలెడలించిన బొమ్మకైవడిన్.

కన్నియనైన నావలపు
   కామనలెల్లను బల్లవింపను
ద్యన్నటనానుకూలగతి
   నాటలపాటలవాద్యఘోషలన్
మన్ననఁజూపుటెల్లనభి
   మానమె? అన్యము నీవెరుంగవే?
నన్నిటు మోసగింపఁదగు
   నా? ఇది ధర్మపథంపుగమ్యమా?

ఫలములమావులన్ మధుర
   భామణలీలలప్రీతి గొల్పినా
తొలివలపున్ రగిల్చితివి
   దుర్దమరాక్షసహన్యమానునిన్
చలమున మాటిమాటికి పు
   నర్నవజీవనుఁ జేసికొంట లో
దలపుపుయొక్క మారటుని
   తాంతరహాఃపరిచర్యలన్ కదా!

ఎంతటిధర్మమూర్తివి మ
   రెంతటిసత్యవ్రతైకశీలవీ
వంతటిప్రేమఁజూపి మన
   సంతయు నీవుగనిండి పండనీ
చెంతనె మత్సుధాప్రణయ
   సేవను లంచును నాసగొల్పి నే
డింతటి మోసమా! మనను
   నిచ్చుటయే యొకవింత శాపమా!

ఆరనిచిచ్చుఁబెట్టి హృద
   యంబున జీవనగుగ్ధపాత్రలో
ఘోరవిషంబుఁ జిల్కితివి
   కోమలమత్ప్రణయైక భావనా
పూరిత హృద్విపంచికను
   మోహనరాగముమీటి, తీవలన్
క్రూరతఁద్రెంచివైచితివి
   కుందెదనే నికభగ్నవీణనై.

## —* రచయితలకు మనవి *—

సంక్షేపముగను, సౌమనస్యముతోఁ గూడినవిగాను, నుండు విమర్శనాత్మక రచనలకు స్వాగతము. గ్రంథవిమర్శకుఁ బ్రాముఖ్యము. ఔచిత్యము మీఱని అభిప్రాయ భేదములకు సముచిత గౌరవము. వాఙ్మయమునఁ జేరఁదగు వివిధాంశములపైఁ దమ రచనలు పంపి మాకుఁ జేయూఁతనీయఁ బ్రార్థన. రచనలు సరళగ్రాంథికములోఁ గాని, శిష్టవ్యావహారికములోఁ గాని యుండవచ్చును. సలక్షణములు రసవంతములు నగు పద్యరచనలకు ప్రత్యేక స్వాగతము.

సమాలోచనముపట్ల ఆదరాభిమానములతో రచయితలు సంపూర్ణ సహకార మొసగుచున్నందుకు సంతోషము. రచన లతిదీర్ఘములై 'సశేషములు' కాకుండునట్లు ప్రయత్నించుట మిక్కిలి అవసరము.

వివిధ ప్రక్రియలకు సంబంధించిన సంగ్రహ రచనల నాహ్వానించుచున్నాము. సమాలోచన గ్రంథవిమర్శకు (సమీక్షకు) ప్రత్యేక ప్రాముఖ్య మిచ్చును. సమీక్షకు పంపు గ్రంథములు రెండేసి ప్రతులు పంపవలయునని గమనింపఁ గోరిక.

— సంపాదకుడు.


అడ్రసు :—

సంపాదకుడు, విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి,

**Retired Telugu Lecturer, V. T. J. College,**

6-8-7, ఇన్నీసుపేట (త్యాగరాజ నగర్), రాజమండ్రి-1.


## —* 'సమాలోచన' ప్రకటన రేట్లు *—

| | | | |
|---|---|---|---|
| రైటిలు 4 వ పేజీ | పూర్తి పేజీ | ఒకసారి ప్రకటనకు | రు. 150. |
| ,, | ½ పేజీ | ,, | రు. 80. |
| ,, | ¼ పేజీ | ,, | రు. 50. |
| మిగిలిన పేజీలలో | పూర్తి పేజీ | ,, | రు. 100. |
| ,, | ½ పేజీ | ,, | రు. 60. |
| ,, | ¼ పేజీ | ,, | రు. 40. |

కంట్రాక్టు రేట్లకు సంపాదకుని పేర వ్రాయుండి.


Editor, Printer and Publisher B. Sitharama Sastry, Printed at B. V. & Co., Press, Innispet, (Tyagaraja Nagar) Rajahmundry-1.